# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

*[Part II—Proceedings other than Questions and Answers]*

OFFICIAL REPORT

---

Second Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Monday, the 28th October,* **1957**

The House met at Half Past Eight of the Clock

[MR. SPEAKER IN THE CHAIR]

### Questions and Answers

(*See Part I*)

### Business of the House

శ్రీ డి. రామబ్రహ్మం (కుప్పం): ఇదివరకు మద్రాసు ప్రభుత్వంలో ఉన్నప్పుడు, ఆంధ్ర రాష్ట్రంలో ఉన్నప్పుడు కూడా **officers list** మాకు యిస్తూండేవారు. ఇప్పుడు హైదరాబాదు వచ్చిన తరువాత ఆఫీసులు ఎక్కడ ఉన్నాయో, ఆఫీసరులు ఎవరెవరో సభ్యులకు తెలియ జేయబడలేదు. కాబట్టి ఈ సమావేశం ముగిసే లోపుగానే **officers,** వారి యొక్క ఆఫీసుల **location** కూడా తెలుపుతూ ఒక **list** తయారు చేయించి సభ్యులకు అందచేయాలని కోరుతున్నాను. లేకపోతే మేము నానా తిప్పలు పడవలసివస్తున్నది. కాబట్టి మాకు ఈ సహాయం చేయాలని అధ్యక్షులవారి ద్వారా కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్: గెజిటెడ్ ఆఫీసర్ల యొక్క క్వార్టర్ల **list** ను గురించా, అడిగేది!

శ్రీ డి. రామబ్రహ్మం: **Offices** యొక్క **location** కూడా మాకు కావాలి.

మిస్టర్ స్పీకర్: ఈ విషయమై ఏమైనా ఏర్పాటు ఉన్నదేమో ముఖ్యమంత్రి గారు తెలుపగలరా ?

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి (నెల్లూరు): అధ్యక్షా! అసలు ఏ యే ఆఫీసులు ఎక్కడెక్కడ ఉన్నాయో, ఆఫీసరులు ఎవరో మాకు తెలియజేసినట్లయితే ఏదైనా పని ఉన్నప్పుడు వెళ్లే దానికి వీలుగా వుంటుంది.

మిస్టర్ స్పీకర్: ప్రతి నెలాకావాలా? ప్రతి రోజూకావాలా? Quarterly కావాలా? ఎట్లా?

ముఖ్యమంత్రి (శ్రీ యన్. సంజీవరెడ్డి): వారడిగేది ఆఫీసుల, ఆఫీసరుల యొక్క లిస్టు. ఆఫీసులు ఒకచోటనే వుండవచ్చు కాని, ఎప్పుడు ఒక ఆఫీసరే ఉంటారనిలేదు. మారుతూ ఉంటారు. అయినా general గా ఆఫీసులు ఎక్కడున్నాయో ఆఫీసరు లెవరో తెల్సు కొనడం పెద్ద కష్టమైన విషయంకాదు. సభ్యులకు కావాలంటే ఒక లిస్టు అచ్చువేయించి యిస్తాను. నాకేమీ అభ్యంతరం లేదు. కాని ఏ ఆఫీసు ఎక్కడ వుందో తెలియని సభ్యులుంటారు. అంతగా తెలియకపోతే telephone చేసి తెలుసుకోవచ్చు.

మిస్టర్ స్పీకర్: భద్రాచలం పడవ ప్రమాదానికి సంబంధించిన విచారణ సంఘంవారి నివేదిక వచ్చింది. దానిని చర్చించడానికి అవకాశమివ్వాలని సోషలిస్టు పార్టీ సభ్యులు గౌ॥ సభ్యులు సత్యనారాయణరాజుగారు కోరారు. దీని విషయమై శాసన సభా నాయకులు వారి అభిప్రాయమును తెలుప గోరుతాను.

శ్రీ యన్. సంజీవరెడ్డి: ఈ విషయమును బిజినెస్ ఎడ్వయిజరీ కమిటీకి రిఫర్ చేయండి. వారు ఎప్పుడు టైము ఫిక్సుప్ చేస్తే అప్పుడు మనము యీ విషయము చర్చింపవచ్చు. నిన్ననే ఆ కమిటీవారు సమావేశమై కొన్ని నిర్ణయాలు చేశారు. మరల రెండు మూడు రోజులలో సమావేశముకావచ్చు. ఈ విషయము కూడ ఎప్పుడు చర్చించవలసినదీ వారు నిర్ణయించడం మంచిది. ఏ అంశము ముందు తీసుకోవచ్చో దేనిని పోస్టుపోన్ చేయవచ్చో ఆ కమిటీవారు ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తే బాగుంటుంది.

శ్రీ జి. యలమందారెడ్డి: ఆహార సమస్యను గురించి, వర్షాలు సక్రమంగా లేని విషయం గురించి చర్చించుటకు అరగంట వ్యవధి ఇప్పించవలెనని అధ్యక్షులవారికి వ్రాసుకున్నాను. దాని విషయము ఏమిచేసినదీ తెలుపగోరుతాను.

మిస్టర్ స్పీకర్: రేపు శాసనసభా నాయకులతో సంప్రదించి ఎప్పుడు అవకాశమిచ్చేదీ తెలియచేస్తాను.

శాసనసభ నిబంధనలను సవరించి నూతన నిబంధనలను తయారుచేయు నిమిత్తమై ఇదివరకు ఒక అడ్ హాక్ కమిటీని వేశాము. రూల్సు ఆఫ్ ప్రొసీజరు అండ్ కాండక్టు ఆఫ్ ది బిజినెస్ అసెంబ్లీలో అవసరమైన మార్పులు చెయ్యడానికి ఆ కమిటీ అనేక సమావేశములు జరిపినది. లోక్ సభ, వెనుకటి హైదరాబాదు అసెంబ్లీ, ఇతర అసెంబ్లీలకు సంబంధించిన నిబంధనలన్నింటినీ తెచ్చి మన నిబంధనలలో అవసరమైన మార్పులు సూచిస్తూ ఒక రిపోర్టు తయారు చేయడమైనది. ఆ నివేదిక సభ్యులముందు పెట్టబడినది. నేను ఆ కమిటీకి అధ్యక్షుడను కనుక ప్రత్యేకముగా దానిని సభముందు ప్రజంటు చేయనక్కరలేదు. ఆ నివేదికయొక్క కాపీలను గౌరవ సభ్యులందరికీ పంచిపెట్టారు. అందులో సూచింపబడిన సవరణలను సభలో ప్రతిపాదించవలసి ఉంటుంది. ఈ నిబంధనలను ఎప్పుడు చర్చించవలెనని కూడా ఎడ్వయిజరీ కమిటీలో నిర్ణయించుకుందాము. తరువాత శాసనసభా నాయకుడు నెమ్మదిగ వాటిని శాసనసభలో ప్రతిపాదిస్తారు.

## Papers Laid on the Table of the House

*Notification issued with G. O. No. 1337 G. A. (Services-A), dated 3-8-57 re: an amendment to Andhra Public Service Commission Regulations.*

*Sri N. Sanjeeva Reddi :* Mr. Speaker, Sir, I beg to lay on the Table of the House, a copy of the Notification issued with G.O. No. 1337, General Administration (Services-A), dated 3-8-1957 making an amendment to the Andhra Public Service Commission Regulations in accordance with clause (5) of Article 320 of the Constitution.

*Mr. Speaker :* The Notification is laid on the Table.

*Notification No. 58 issued under Section 11 (1) of the Madras Motor Vehicles Taxation Act, 1931.*

*Sri N. Sanjeeva Reddi:* Mr Speaker, Sir, I beg to lay on the Table of the House, under sub-section (2) of section 11 of the Madras Motor Vehicles Taxation Act, 1931 (Act III of 1931), a copy of Notification No. 58 issued under section 11 (1) of the Madras Motor Vehicles Taxation Act, 1931 published at page 176 in Part I of the Andhra Pradesh Gazette, dated 7-2-1957.

*Mr. Speaker:* The Notification is laid on the Table.

## The Andhra (Inam) Tenants Restoration to Possession Rules,, 1957.

**The Minister for Revenue (Sri K. Venkata Rao):* Mr. Speaker, Sir, I beg to lay on the Table, under Section 13 (2) of the Madras Estates Land(Andhra Amendment)Act, 1956, a copy of the Andhra (Inam) Tenants Restoration to Possession Rules, 1957 which were published in the Rules Supplement to Part II of the Andhra Gazette, dated the 22nd August, 1957.

ఈ రూల్సు 22–8–1957 తేదీ గెజెట్‌లో ప్రకటించబడినవి. పై నుదహరించిన శాసనము లోని 13 (2) సెక్షను క్రింద యీ రూల్సు తయారు చేయడానికి ప్రభుత్వానికి హక్కు వచ్చింది. 7–1–1948 వ తేదీన ఎవరైతే ఒక యీనాము భూమి మీద టెనెన్ట్‌గా ఉన్నారో అటువంటి వారు తిరిగి తమ యొక్క ఆస్తిని సంపాదించుకొనే విషయమై యీ రూల్సు తయారు చేయబడ్డాయి. వీటి ప్రకారము ఆ రైతు ఒక నోటీసు యివ్వవలసి యుంటుంది. ఆ నోటీసు భూ స్వామికి ఆ భూమిని ప్రస్తుతము ఆక్రమించు కొని ఉన్నటువంటి వారికి ఇవ్వవలసి వుంటుంది. ఈ నోటీసు 6 నెలలు లోపుగా ఇవ్వవలసి యున్నది. అయితే ఈ నిబంధనలు తయారు చేసే టప్పటికి

ఆ 6 నెలల కాలము పూర్తి అయిపోవడమువల్ల 14వ సెక్షను క్రింద గవర్నమెంటు వారికి ఉన్న అధికారమును పురస్కరించుకొని ఆ నోటీసు ఇవ్వవలసిన ఆవశ్యకత లేదని నిర్ణయించబడింది. అందువల్ల ఒక సంవత్సరము లోపల ఎవరైనా ఇటువంటి దరఖాస్తు పెట్టుకున్నట్లయితే శాసనములో ఉన్న ప్రకారము వారికి రావలసిన రిలీఫ్ వస్తుంది. ఈ రూల్సును పురస్కరించుకుని ఏ విధంగా దరఖాస్తు పెట్టుకోవాలి, ఏరకంగా ఫీజు చెల్లించాలి, అప్పీల్సు ఏ విధంగా ఫైల్ చేయాలి అనే విషయాలను గురించి చర్చించడానికి యీ సభవారి ఆమోదమును కోరుతున్నాను.

*Mr. Speaker:* The Andhra (Inam) Tenants Restoration to Possession Rules, 1957 is laid on the Table.

## Resolution re: election of one member to Zonal Railway Users' Consultative Committee of the Southern Railway

*The Minister for Communications (Sri M. Narsing Rao):* Mr. Speaker, Sir, I beg to move:

"That as the term of the present Members of the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway will expire on the 31st December, 1957 and the Committee will have to be reconstituted thereafter. As the General Manager, Southern Railway, has requested the Government to communicate to him the name of the member to represent to the Andhra Pradesh State Legislative Assembly on the Committee for the terms of its office from 1-1-1958 to 31-12-1959, this Assembly do recommend to the Government to communicate to the Southern Railway the name of one member belonging to the area covered by the Southern Railway, elected by this Assembly to serve on the Committee for the above period."

*Mr. Speaker:* Motion moved.

శ్రీ కె. సుబ్బారావు (హిందూపూరు—జనరల్):—అధ్యక్షా, సదరన్ జోనల్ రైల్వేలోని కొన్ని మార్గములలో ప్రజలు పడుతున్న బాధలు మంత్రిగారికి తెలుసు ననుకుంటాను. ఈ మధ్యన హైదరాబాదు నుంచి బెంగుళూరుకు పేరే ఎక్స్‌ప్రెస్ బండివేస్తున్నామని, వేసినామని, ప్రకటించటం జరిగింది. ఐతే ఇదివరకు ఉన్న ప్యాసింజరు బండికే ఎక్స్‌ప్రెస్ అని పేరుపెట్టి నడుపుతున్నారు. దీనివల్ల ప్రజలకు చాలా ఇబ్బందిగా వున్నది. మన శాసనసభ నుంచి కూడా ఆ రైల్వే కౌన్సిలుకు ఒక సభ్యుని పంపించడం మాత్రమే కాక యీ విషయములన్నిటితో మంత్రిగారు శ్రద్ధ వహించవలెనని కోరుతున్నాను. నేను చెప్పిన బండి ద్రోణాచలములో 3 గంటలు, ఇంకొక చోట 2 గంటలు ఆగిపోవడము జరుగుచున్నది. ఈ లోటుపాట్లన్నిటిని గురించి రైల్వే వారికి మంత్రిగారు వ్రాసి ప్రజలకు ఇక్కట్లు తప్పునట్లు చేయవలెనని కోరుతున్నాను.

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు (నందిగామ):—మంత్రిగారు ప్రతిపాదించిన తీర్మానము ప్రకారము మన ఆంధ్ర ప్రదేశ శాసనసభ నుంచి జోనలు కౌన్సిలుకు ఒక సభ్యుని పంపే అవకాశ మున్నది. ఒకే సభ్యుని పంపే ప్రాతినిధ్యం సరిపోదని కనీసము ముగ్గురు సభ్యులైనా ఉండవలెనని సదరన్ రైల్వే జోనల్ కౌన్సిలు వారికి తెలియ చేయవలెనని ఇదివరలో కోరాము. దానిని గురించి మంత్రిగారు ఏమి ఆలోచించారని అడుగుతున్నాను.

శ్రీ పి. కోదండరామయ్య (పోలవరం):—గౌరవ సభ్యులు శ్రీ సుబ్బారావుగారు చెప్పిన దానితో నేను ఏకీభవిస్తున్నాను. ఐతే మా ప్రాంతమునకు సంబంధించిన రైలు మార్గములో నడిచే బండ్లలో మేము పడుచున్న ఇబ్బందులను గురించి నేను తెలియ చేస్తున్నాను. ఈ మధ్య పూరీ ప్యాసింజరును ఎక్స్‌ప్రెస్‌గా మార్చారు. ఆ బండిలో మధ్య వాడి, లేక బల్హార్షా కు పోయే బోగీలను తగిలిస్తున్నారు. వాటికి బోర్డులు లేవు. ఈ కారణముగా మొన్న 24వ తేదీన ఆ బోగీలలో ప్రయాణము చేస్తున్న వారిని డోర్నకల్‌లో దింపి వేయడం జరిగింది. అదే విధముగా కాజీపేటలో కూడ కొంతమందిని దింపి వేశారు. ఇందువల్ల ఆ ప్రయాణీకులు ఇతర భోగీలలోనికి వెళ్ళడానికి ఎంతో యాతన పడవలసి వచ్చింది. ఎంతో కష్టపడి 1777 నెం. బోగీలోనికి మేము రాగలిగినాము. బయట కురిసిన వర్షమంతా ఆ బోగీలోనే ఉన్నది. మనుష్యులు కూర్చోడానికి గాని, నుంచోడానికి గాని వీలు లేకుండా బోగీ వర్షముతో నిండిపోయినది. పెట్టెలు, ఇతర సామగ్రి తడిసిపోయినవి. ఇటువంటి పాత బోగీలను తీసివేసి కొత్త బోగీలను వేయించే ఏర్పాటు చేయించ వలసి యున్నది. అంతేకాకుండా ఏ బోగీ ఎక్కడకు వెళ్ళుతుందో ప్రయాణీకులకు సరిగా తెలిసే నిమిత్తము వాటిపై పూరీలోనో లేక విశాఖ పట్టణంలోనో అవి బయలు దేరే స్థలములోనే బోర్డులువేసే ఏర్పాటు చేయించ వలసి యున్నది. వీటిని గురించి రైల్వే అధికారులకు వ్రాసి తగిన ఏర్పాట్లు చేయించ వలెనని మంత్రిగారిని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్: రైలు ప్రయాణములోని కష్టాలను గురించి ప్రజల తరఫున చెప్పటానికి ఈ మెంబర్సు అక్కడకు పోతారు. అందువల్ల అక్కడ బాగా చెప్పగలిగిన ఎవరిని పంపిస్తే ఎక్కువ ఉపయోగంగా ఉంటుందో వారినే పంపండి. కాని ఒకరు చాలరు, ముగ్గురు ఉంటే బాగుంటుదనే విషయం మంత్రిగారు కరెస్పాండెన్సు చేసినారా, లేక చేయదలచుకొన్నారా, అనే విషయం తెలుసు కోవలసి యున్నది. ఆ విషయం మంత్రిగారు సెలవిస్తే బాగుంటుంది. మిగతావన్నీ ప్రయాణీకుల యిబ్బందులకు సంబంధించినవి.

శ్రీ యమ్. నరసింగరావు: శ్రీ సుబ్బారావుగారు చెప్పినట్లు కొంతవరకు కష్టాలు ఉన్నవి. ఈ మధ్య నేను అనంతపురం, కర్నూలు వెళ్ళివచ్చేటప్పుడు ఒక కూపే యివ్వాలని వారం రోజులు ముందుగా తెలిపాము. కర్నూలు వచ్చిన తరువాత రిజర్వేషన్ లేదు. వారము రోజులు ముందుగా తెలిపినా కూపే లేదన్నారు. మర్నాడు ఉదయమే యిక్కడికి చేరుకోవలసి యున్నది. ఏదో విధంగా ఏర్పాటు చేసుకొని, 3 వ క్లాసు కంపార్టుమెంటు యిస్తే వచ్చినాము. కాబట్టి ఒక్కొక్కసారి యిబ్బందులు కలుగుతుంటాయి. ఇంకొక మిత్రుడు డోర్నకల్‌లో కష్టమయినదన్నారు. జరిగి ఉండవచ్చును. ఇటువంటి కష్టాలు వారి ఎదుట పెట్టటానికే మన మెంబర్లు జోనల్ కమిటీలలోకి వెళ్ళుతున్నారు. సెంట్రల్ జోన్, సదరన్ జోన్,

సౌత్-ఈస్ట్రన్‌జోన్ అని మూడు జోన్లు ఉన్నవి. అయితే బెంగుళూరుకు వేరే ట్రైన్ వుండ వలెనని సభ్యులు చెప్పినట్లు నేను గ్రహించాను ! అది ఎంతవరకు సాధ్యమో చూడవలసియున్నది.

శ్రీ కె. సుబ్బారావు : రైలు వేస్తామని చెప్పి, వేయకుండా డాడ్జ్ చేశారు.

శ్రీ యమ్. నరసింగరావు : కావచ్చును. తరువాత, యిప్పుడు హైదరాబాదు నుంచి వెళ్ళే ప్రూరి ఎక్స్‌ప్రెస్, జనతా ఎక్స్‌ప్రెస్ చాలా సౌకర్యంగా ఉన్నవని సభ్యులు కూడా చెప్పారు. మునుపటి కష్టాలు లేవని చెప్పారు. హైదరాబాదు నుంచి బెంగుళూరుకు ప్రత్యేకంగా రైలు వేయ వచ్చును. అది వేరే విషయం. మనం పంపే సభ్యుల సంఖ్య పెంచాలన్నారు. ఇప్పుడు అసెంబ్లీ నుంచి ఎన్నుకోబడేవారు ఒకరు, గవర్నమెంటునుంచి యింకొకరు ఉంటారు.

మిస్టర్ స్పీకర్ : గవర్నమెంటు తరపున యింకొక నామినేటెడ్ మెంబరు ఉంటాడా ?

శ్రీ యమ్. నరసింగరావు : కోరవచ్చునని అనుకుంటాను.

శ్రీ కె. వెంకటరావు : కౌన్సిల్‌వస్తే మనకు యింకొక మెంబరుంటారు.

శ్రీ యమ్. నరసింగరావు : ఈ విధంగా ఎక్కువ వేయటానికి అవకాశం వుంది కాబట్టి ఆలోచించ వచ్చునని మనవి చేస్తున్నాను.

శ్రీ పి. గోపాలురెడ్డి (తిరుత్తని) :—ప్రయాణీకుల కష్టాలను ఇదివరలో వెళ్ళిన మెంబర్లు రైల్వే అడ్వైజరీ కౌన్సిల్‌లో చెప్పినారా ? కష్టాలు తొలగించుటకు సాధ్యం అయినదా, లేదా, ఆ వివరాలు మంత్రిగారికి తెలుసా ? తరువాత మూడు నెలలకొకతూరి రైలు టైము మార్చే టప్పుడు మాకు మెమో వస్తుంది. సజషన్సు అడుగుతారు. ఈ సజెషన్సు ఎవరికీ **forward** చేస్తున్నారు ! ఇటువంటి రిప్రజెంటేషన్సు ఆ మెంబరు ద్వారా **represent** చేస్తే అనుకూలంగా ఉంటుంది. ఆ మెంబరు అక్కడ అడ్వైజరీ కౌన్సిలులో మన కష్టాలు చెప్పి వాటిని తొలగించే సామర్థ్యం లేక పోతే వృధా ప్రయాస అవుతుంది. మద్రాసునుంచి హైదరాబాదు వచ్చే ఎక్స్‌ప్రెస్ కంపార్టుమెంటులో—అది పేరుకు హైదరాబాదు కంపార్టుమెంటు అయినా అటు గూడూరు, నెల్లూరు, ఒంగోలు, తెనాలి—ఈ మధ్య స్టేషన్సులో ఎక్కేవాళ్ళతో వత్తిడి రోదన, ఎక్కువగా వున్నది. టికెట్ కలెక్టరును పిలిచినా రాడు. అరాచకం అనేది ఆ పెట్టెలో చూడవచ్చునని మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. దానిని గురించి చర్య తీసుకోవాలని ప్రార్థిస్తున్నాను.

ముఖ్యమంత్రి (శ్రీ యన్. సంజీవరెడ్డి) :—రైల్వే కమిటీకి ఒక మెంబరును ఎన్నుకోవాలని ఒక మోషన్ మూవ్ చేస్తే, మొత్తం రైల్వే పాలసీమీద, అడ్మినిస్ట్రేషన్‌మీద, ఆ కమిటీలో జరుగుతున్న వ్యవహారాలను గురించి యిక్కడ చర్చించ పూనుకొనడం, మీరు ఎంతసేపైనా టైము యివ్వండి, నాకు అభ్యంతరము లేదు గాని—ఇప్పుడు అటువంటి చర్యకు యిది వేదిక కాదు.

మిస్టర్ స్పీకర్ :—కొంచెం చెప్పనివ్వండి. ఇవి రోజూ పడుతున్న బాధలు కనుక, ప్రజల తరపున సభ్యులు మంత్రిగారికి చెబితే, మంత్రిగారు ఏదైనా చేస్తారని ఆశ. అందువల్ల ముగ్గురు నలుగురు మెంబర్లను **allow** చేశాను.

శ్రీ ఇ. చిన్నప్ప (మహబూబ్‌నగర్) :—బెంగుళూరుకు ఇదివరకు ప్రకటించిన రైలు ఆపు చేశారు. ఆ విషయం చెప్పకోవలసి యున్నది.

*Mr. Speaker :* The question is :

" That as the term of the present Members of the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway will expire on the 31st December, 1957 and the Committee will have to be reconstituted thereafter. As the General Manager, Southern Railway, has requested the Government to communicate to him the name of the member to represent the Andhra Pradesh State Legislative Assembly on the Committee for the terms of its office from 1-1-1958 to 31-12-1959, this Assembly do recommend to the Government to communicate to the Southern Railway the name of one member belonging to the area covered by the Southern Railway, elected by this Assembly to serve on the Committee or the above period. "

The motion was adopted.

*Mr. Speaker :* With reference to the motion of the hon. Minister for Communications regarding the election of one person to be the Member of the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway for the next term of its office from 1-1-1958 to 31-12-1959, I fix 3 P.M. on 31-10-1957 as the time within which nomination papers of candidates for the election to the Zonal Railway Users' Consultative Committee of Southern Railway, should reach the Secretary, Legislative Assembly, Andhra Pradesh.

If the number of candidates nominated exceeds the number of vacancies to be filled, *viz.* one, a poll will be taken on a date to be announced in due course. The election will be by the ordinary method (direct election) and not according to the principle of proportional representation by means of a single transferable vote.

**The Madras Estates (Abolition and Conversion into Ryotwari) (Andhra Pradesh Amendment) Bill, 1957 (as reported by the Select Committee.**

✓ **Sri K. Venkata Rao :* Mr. Speaker, Sir, I beg to move :

" That the Madras Estates (Abolition and Conversion into Ryotwari) (Andhra Pradesh Amendment) Bill, 1957, as

reported by the Select Committee, be taken into consideration at once."

"The Madras Estates (Abolition and Conversion into Ryotwari) (Andhra Pradesh Amendment) Bill, 1957 as reported by the Select Committee."

అధ్యక్షా, యిది సభవారిముందు పెట్టి యిప్పుడే ఆలోచించి శాసనము జేయాలని కోరుతున్నాను.

ఈ బిల్లు 18–4–57 న ఈ శాసనసభ ముందు పెట్టబడింది. Select Committee Report 31–7–57 న సమర్పించ బడింది. ఇందులోని విషయం ఏమంటే, Madras Estates Land Act, 1908 లోని Section 3 (2) (*d*) అనేక సవరణలకు గురి అయినది. తర్వాత మళ్ళీ దానిని సవరణ చేయాలనే ఉద్దేశం ప్రభుత్వమునకు లేదు. సవరణ చేయాలన్నా, ఆ సెక్షను కూడా ఈ సమావేశం ముందు లేదు. ఇప్పుడు దీనియొక్క ఉద్దేశ్యం ఏమంటే, 1934 లో 1936 లో, 1945 లో, 1956 లో జరిగిన సవరణల క్రింద ఏవైతే ఎస్టేట్లు అయినవో ముఖ్యంగా 1936 ఎస్టేట్లు అని పిలువ బడే ఎస్టేట్లు యింతవరకు ఏవైతే రద్దు చేయబడలేదో—వాటిని ఈ బిల్లుద్వారా రద్దు చేయటానికి యత్నం జరుగుతోంది. ఏది ఎస్టేటుఅనే నిర్ణయంతో యిప్పుడు సంబంధం లేదు. ఇదివరకు నిర్ణయింపబడిన ఎస్టేట్లు, 1936 న ఉన్నవి. ఇప్పుడు వాటిని రద్దు చేయటానికి యీ బిల్లు ప్రవేశ పెట్టబడిందని నేను సభవారికి మనవి చేస్తున్నాను.

దీనిలో ఉన్న తేడా ఏమంటే—1908 సం॥ లో యిచ్చిన definition లో మేలువరం–అంటే పన్ను వసూలు చేసుకునే హక్కు ఏ ఏ ఈనాముల విషయమై ఈనాందార్లకు యివ్వబడిందో, అవే ఎస్టేట్లు క్రింద పరిగణించారు. 1934, 1936 లో జరిగిన అమెండ్‌మెంట్లు ప్రకారం ఎవరికైనా మేలువరం కుడివరం హక్కులు ఉండే రైతు ఒక సంవత్సరం ఆదాయం అయనకు పన్నుల క్రింద యిస్తే మేలువరం, కుడివరం హక్కులు రద్దుఅయి, అవి ఎస్టేటు క్రింద ప్రకటించబడి, ఆ హక్కులు రైతుకు వస్తాయని 1936 లో నిర్ణయించబడింది. అయితే దీనిని గురించి కోర్టులో కొన్ని చర్యలు తీసుకొనుటవలన అనుకొన్న ప్రకారం వ్యవహారం జరగలేదు కోర్టులో చెప్పినదేమంటే, ఆ క్లాజు లో 'whole village' అన్నారు గనుక, దానిలో ఒక భాగము యింకొకరికి ఎవరికైనా యిస్తే అది ఎస్టేటు కాదనిజడ్జిమెంటుచెప్పారు ఇలా యివ్వబడిన ఎస్టేటు ఒక గ్రామంలో మజరా, ఖండ్రిక hamlet అయినట్లయితే అదికూడ ఎస్టేటు కాదని కోర్టులు నిర్ణయించాయి.

మొట్టమొదట ఈనాం గ్రామం దానం చేయబడ్డ తరువాత ఈనాందారు తనది తానే గ్రామంలో ఒక భాగాన్ని యింకొకరికి దానంచేస్తే, ఈనాం కమీషన్ పని చేసినప్పుడు, ఇద్దరికీ వేరొక పట్టా యిచ్చి ఉన్నట్లయితే, అదికూడ ఎస్టేటు కాదని కోర్టులు నిర్ణయించాయి అప్పుడు 1945, అప్పుప్రకారం యింకొక సవరణ తీసుకువచ్చి ఎస్టేటు ఖాతాన పేరుతో ఉన్నట్లయితే దానిని బ్రిటిష్ గవర్నమెంటు, recognise and confirm చేసి ఉన్నట్లయితే అది

ఎస్టేటు క్రింద పరిగణించబడుతుందని చేప్పారు. కాని ఈ సవరణలోని నిర్వచనాన్నికూడ కోర్టు అంగీకరించలేదు. ఏవో కొన్ని జడ్జిమెంట్లు చెప్పి, "A 'hamlet' cannot be a village by itself" అని రూలింగ్ ఇచ్చారు. అందువల్ల ఖండ్రికలు ఎస్టేటులు అవటానికి వీలులేకపోయింది. తిరిగి 1956 వ సంవత్సరంలో దీనికొక సవరణ తెచ్చి, ఖండ్రికలన్నీ ఎస్టేట్ల క్రింద పరిగణించి వాటిని రద్దుచేసేదానికి కూడా ఒక శాసనంచేయటం జరిగింది. ఇవ్వాళ ఉన్న పరిస్థితి ఏమంటే, యీ తరహా ఎస్టేట్లన్నీ రద్దు కాలేదు కాని, మద్రాస్ రెంట్ రిడక్షన్ యాక్ట్ మాత్రం అన్నింటికి అమలు జరపటం జరుగుతోంది. 1947 వ సంవత్సరంలో రెండు యాక్టులు పాస్ అయ్యాయి. ఎస్టేటు గ్రామాలన్నింటిలో కూడ, రైత్వారీ గ్రామాలలో ఉన్నటువంటి రీతిగా పన్ను తగ్గించి తీరాలి అని ఒక నిర్ణయం ఉన్నది. అందువల్ల ప్రతి ఎస్టేటుకు రెంట్ రిడక్షన్ యాక్టు అప్లయి అవుతోంది. కొన్ని ఎస్టేట్సు రద్దు అయినాయి. కొన్ని ఇంకా రద్దు కాలేదు. ఎస్టేటు గ్రామాల్లో, అసలు ఎస్టేటు యొక్క స్వభావాన్ని గురించి వివాదకరమైన విషయాలు ఉన్నవి. ఈ రోజున యీ బిల్లు శాసనం కావటం ద్వారా, ఇంత వరకు రద్దు కాకుండా మిగిలి ఉన్న యీ రెండు తరహా ఎస్టేట్లను రద్దు చేయటం అవుతుంది. మామూలుగా ఇనాము అన్న పదం ఉపయోగించటంవల్ల కొన్ని అపార్థాలు కలుగుతున్నాయి. ప్రతిగ్రామంలో ఉన్నటువంటి పట్టాలు అన్నీ ఇనాము ఎస్టేట్లు కావు. దీంట్లో వర్ణించిన రీతిని ఏ గ్రామాలైనా పట్టా పొంది ఉన్నట్లయితే అవే ఇనాము ఎస్టేట్లు అవుతాయి. ఇంతవరకు రద్దు కానటువంటి ఇనాము ఎస్టేటులన్నింటినీ, యీ బిల్లుద్వారా రద్దు చేయటానికి నిర్ణయం జరిగింది. 1947 లో ప్యాస్ అయినటువంటి ఎస్టేటు ఎబాలిషన్ యాక్టు లోని 3వ సెక్షన్

'It applies to all 'Estates' as defined in Section 3 (2) (*d*) of Madras Estates Land Act of 1908 except Inam Villages which became Estates by virtue of the Madras Estates Land (Amendment) Act of 1936."

అని ఉన్నది. పాత ఆంధ్ర రాష్ట్రంలో ఇటువంటి ఎస్టేట్లు 1061 ఉన్నట్లు ఉజ్జాయింపు లెక్క. ఫలానా స్వరూపం అయినది ఎస్టేటు అవుతుందని మనం నిర్ణయించే హక్కు ఉన్నది కాని, మనకు తెలియనటువంటి లోపాలోపాల వల్ల అవి ఎస్టేట్లు అవునో కాదో తెలియదు గనుక ఉజ్జాయింపుగ లెక్కవేసుకొంటే అటువంటి ఎస్టేట్లు 1061 ఉన్నట్లు రుజువు అవుతోంది. ఇప్పుడు యీబిల్లుద్వారా వీటన్నింటిని రద్దు చేస్తున్నాము. 1956 లో రద్దు చేసినటువంటి ఖండ్రికలకు కొన్నిచోట్ల ఎక్కడైనా ఈ డెఫినిషన్ ప్రకారం మేలువరం కుడివరం రైట్సు ఉండవచ్చు. అందువల్ల అవి కూడ వీటితోపాటు రద్దు అయిపోతున్నాయి. 1948 వ సంవత్సరపు చట్టం ప్రకారంగా ఇప్పుడు ఎబాలిష్ అవుతున్న ఎస్టేట్లకు కాంపెన్సేషన్ ఇవ్వబడుతుంది. కాంపెన్సేషన్ కు సంబంధించిన సెక్షన్సు 31, 37. జమీందారీ ఎస్టేట్ ఎబాలిషన్ కు ఇచ్చే కాంపెన్సేషన్ కు, ఇనామ్ ఎస్టేట్ ఎబాలిషన్ కు ఇచ్చే కాంపెన్సేషన్ కు తేడా ఉంది. రెంట్ రిడక్షన్ యాక్టు క్రింద తగ్గించబడినటువంటి భూమి శిస్తులో, మూడవ భాగము తీసుకొని, దాంట్లో కొన్ని మినహాయింపులు తీసి, దానికి ఇన్నిరెట్లు అని 37 వ సెక్షన్ ప్రకారం జమీందారీ ఎస్టేటుకు

అవకాశము ఉన్నది. దీనివల్ల ఈ రైతులందరు వారి చేతులలో ఉన్న ఇనాం భూములను నిలబెట్టు కోటానికి, ఉన్నహక్కులు కాపాడుకోటానికి ప్రయత్నించే సమస్యగా తయారవుతుంది. ఇప్పుడు ఇనాం దార్లు రైతులనుభూములనుంచి వెళ్ళగొట్టటానికి ప్రయత్నము చేస్తున్నారు. ఈలాంటి పరిస్థితులున్న సమయము ఇనాం రైతులు ప్రభుత్వం వద్దకు రాయబారముల ద్వారా తమ యొక్క కష్ట నిష్ఠూరాలను తెలుపుకుని యున్నారు. ఈనాడు ఈ సవరణ బిల్లు సభ ఎదుటకు చర్చకు వస్తున్నదని అంటే, ఇనాందార్లు రైతులను తొలగించకుండ ఏ విధమైన రక్షణ ప్రభుత్వము కలుగజేయబోతుందో అని ఎదురు చూస్తున్నారు. గత శాసనసభలో కళా వెంకటరావుగారు తమ ఉపన్యాసములో "మేలువారపు హక్కు ఎవరికి ఉన్నప్పటికినీ, రైతులకు వచ్చే ఇబ్బంది ఏమి వుండబోదు, ఆ అధి కారము ఇనాందార్లదా? జమీందార్లదా? ప్రభుత్వముదా అనేది ఒక సిద్ధాంతానికి సంబంధించి నటువంటిదే గాని, నిజానికి యినాంరైతుకు కావలసినది తాను చెల్లించే శిస్తు తగ్గడమే కదా" అన్నారు. ఈ రోజున Estates గా పరిగణించ బడిన గ్రామాలను అన్నింటినీ ప్రభు త్వము తీసుకోవడము అవసరమైనప్పటికినీ, మంత్రిగారు చెప్పినట్లు ఇనాం రైతులను భూముల నుంచి ఇనాందారు వెళ్ళగొట్టటానికి వీలు లేకుండా న్యాయమైన శిస్తు మాత్రమే తీసుకోవడం చాల ముఖ్యము. అదే అసలు ఇనాం రైతులకు కావలసిన సమస్య అని మంత్రిగారే అన్నారు. గత ఏప్రియల్ 18వ తేదీన యీ బిల్లును Select Committee కు పంపించే ముందు మంత్రిగారు "ఇనాంరైతుల సమస్య ఈ రోజుతో పరిష్కారమైనట్లే నన్నారు. ఇది వాస్తవం కాదు. నేడు మన ముందు ఉన్న సమస్య ఏమిటంటే, 20, 30 లక్షల మంది ఇనాం రైతులను భూములనుంచి తొలగించకుండా ప్రభుత్వము ఏదైనా రక్షణ కలుగ జేస్తుందా? అలా కలుగజేయక పోతే, 1956 Inams Abolition Act వల్ల ఇనాంరైతులనందరిని భూములనుంచి తొలగించటానికి అవకాశమున్నది. ఆ చట్టము ప్రకారము ఇనాందార్లు రైతులను భూములనుంచి తొలగించటానికి చర్యలు తీసుకుంటున్నారు. యీ చట్టమును రద్దు పరచటానికి తమయొక్క భూములను నిలబెట్టుకోటానికి రైతులు ఏ విధ మైన మార్గములు అవలంభించాలి? ఈ ఆలోచన రైతులను వేదిస్తూ వుంది. వెంకటరావుగారు చెప్పినట్లు యీ సమస్య 1908 వ సం. నుంచి కూడా వస్తూనే వున్నది. 1908 వ సం. లోనే ఇనాందార్లకు, జమీందార్లు మాదిరిగా శిస్తులు వసూలు చేసుకునే అధికారము మాత్రమే ఉండాలని భూములు మాత్రము రైతులకే వుండాలని మద్రాసు ప్రభుత్వము దీనికి సంబంధించిన బిల్లును చర్చించి అంగీకరించినది. ఆనాడే రైతులకు భూమి మీద హక్కు వున్నదని అన్నారు. ఈనాడు మనము 1957 వ సంవత్సరములో ఉన్నాము. మనము ద్వితీయ పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుకునే యీ సమయములో దున్నేవాడికే భూమి ఉండాలి అని అనుకుంటున్నప్పుడు భూ సంస్కరణలు అమలులోనికి తెచ్చుకుందాము అనుకునే సమయములోను, స్వంత కమతాలకు సీలింగు నిర్ణయించాలి అని అనుకునే సందర్భములో ఈనాం రైతులకు 1908 వ సం. లోనే గుర్తించిన హక్కులు, తప్పక కాపాడాలి. ఇనాందార్లకు ఉన్న హక్కు శిస్తులు వసూలు చేసుకోవడము మాత్రమే. 1957 వ సం. లో ఇనాము సమస్యను గురించి చర్చించేటప్పుడు భూమి దున్నుకునే వాడు రైతే గనుక, ఇనాం రైతుకు భూమి వుంచడము న్యాయమని గుర్తించాలి.

ఇదే విషయము కళ్ళా వెంకటరావుగారు కూడ చెప్పారు. ఈ నాటి బిల్లులో రైతులకు ఆ మాత్రపు అవకాశము కలుగచేయటానికి Section 3 (2) (*d*) ను amend చేయాలి. ఈనాం రైతు అనిపించుకునే ప్రతి ఒక్క రైతుకు గూడ అటువంటి అవకాశము కలుగచేయాలి అని అంటున్నాను. 1908వ సం. లోనే యీ సిద్ధాంతాన్ని ఆనాటి ప్రభుత్వము అంగీకరించింది. 1908వ సం. నుంచి 1957వ సం. వరకు యీ విషయము చర్చకు వస్తూనే వున్నది ఇంతవరకు ఈ సమస్య పరిష్కారము కాక పోవడము శోచనీయము. 1908వ సం. Estates Land Act ప్రకారము ఏ ఏ ఇనాం గ్రామం విషయములో మేలువరము హక్కు వున్నదో వాటిని అన్నిటిని Estates గా పరిగణించారు. 1936వ సం. వచ్చేటప్పటికి ఈనాము గ్రామాలకు కుడివరము హక్కులు. మేలు వరము హక్కులు కూడ ఇనాందారుకు వున్నప్పటికీ ఆ ఇనాం గ్రామాలను Estates గా పరిగణించి, ఇనాం దారులకు కుడివరము హక్కు ఉన్నదని నిరూపణ చేసుకుంటే అదనంగా ఒక్క సంవత్సరము శిస్తు చెల్లిస్తే ఆ ఇనాందారుకు ఆ ఇనాం భూమిపైన కుడివరం హక్కు రద్దు అయిపోయేటట్లుగా చట్టము చేశారు. తరువాత 1945 లో ఒక గ్రామము ఇచ్చే ముందు ఒక చిన్న పోర్షను గ్రాంటుగా యిచ్చి దానిని ఈ గ్రాంటులో కలుపకపోయినా అదిఎస్టేటు అవుతుందని చట్టాన్ని సవరించారు. గవర్నమెంటు గ్రామాలకు అనుబంధముగా లేని ఇనాము మజరాలను కండ్రికలను ఎస్టేట్లుగా పరిగణించేటట్లు 1956వ సం. లో ఒక సవరణ బిల్లును తేవడము అయింది. ప్యాసుచేశారు. ఆనాడు ఆ బిల్లును చర్చించేటప్పుడు దీనిక్రిందకు రాని ఇనాం గ్రామాలు, మజరాలు, కండ్రికలను ఎస్టేట్లుగా మార్చుటకు మరొక సవరణ బిల్లు తెస్తామని ప్రభుత్వంతరపున హామీఇచ్చారు. అటువంటి బిల్లు తేకుండానే దీనితో intermediaries అన్ని రద్దు అయిపోతాయి. గనుక ఈ సమస్య పూర్తిగా పరిష్కారమయినట్లేనని శ్రీ కళ్ళా వెంకటరావుగారు చెప్పడం న్యాయం కాదు. నిజానికి ఈ సమస్య పూర్తిగా పరిష్కారం చేస్తారని ఆశించాము. కాని ప్రభుత్వం తన హామీని అనుసరించి ఇనాంరైతుల హక్కులను కాపాడుటకు పూనుకోలేదు. ఈనాడు ఆంధ్ర ప్రాంతములో 11 జిల్లాలలో వున్న ఇనాం రైతులకు భూమి మీద హక్కు గుర్తించాలని 1908 నుండి చట్టాలు రావడం కోర్టు తీర్పుల వల్ల ఆ చట్టాలను సవరించడం జరుగుతూ ఉంది.

1936 వ సంవత్సరంలో రెండు 'వరం' లు ఇచ్చినప్పటికీ కూడా అది ఎస్టేటు అవుతుందని ప్యాసుచేశారు. అందువల్ల ఇప్పుడు మనకు ఇనాం title deeds లో వారేవిధంగా వ్రాసి ఇచ్చారు అనే సమస్య లేనేలేదు. ఈ సిద్ధాంతం కూడా 1936వ సంవత్సరంలోనే పరిష్కారమైనది. 1936 వ సంవత్సరంలోవున్న ప్రభుత్వం ఎటువంటిదో మనకు తెలుసును. ఆ విధంగా అప్పుడున్నటువంటి బొబ్బిలి రాజాగారి నాయకత్వం క్రిందనున్న ప్రభుత్వమే రెండు వరంలు ఇనాందార్లకున్నప్పటికి కూడా దీనిని ఎస్టేటుగానే పరిగణించి ఆ రైతులకు భూమి మీద శిస్తాయితీ హక్కు ఉండాలి అని ప్యాసుచేసినది. Compensation ఇవ్వాలేదని ఆక్షేపణ వచ్చినప్పుడు ఇదివరకే చెల్లిస్తున్నటువంటి శిస్తు అదనంగా ఒక సంవత్సరం చెల్లిస్తే సరిపోతుందన్నారు.

శ్రీ వెంకటరావుగారు చెప్పినట్లు 1956 వ సంవత్సరంలో తెచ్చిన ఈనాం భూముల రద్దు చట్టం ప్రకారం చెప్పినట్లుకాని ఇనాం గ్రామాలలోని భూములను ఇనాందారులకు పట్టాలిచ్చే ప్రకారం చూస్తే 1936 వ సంవత్సరంలో బొబ్బిలి రాజా రెండు వరంలున్నప్పటికి కూడా ఒక సంవత్సరం శిస్తు compensation ఇస్తే సరిపోతుందన్నారు. ఆ రోజులలో వాళ్ళు ఒప్పుకోలేదు. కాని 1956 వ సంవత్సరం ఆంధ్ర ప్రభుత్వం చేసినటువంటి ఇనాం భూముల రద్దు చట్టం ప్రకారం, ఇనాం రైతులు సాగుచేసుకొని తరతరాలుగా కొనుక్కుంటూ, అమ్ముకుంటూ. వంశపారంపర్యంగా అనుభవిస్తున్నటువంటి భూములను, ఇనాందారులకే రైత్వారి పట్టాలు ఇచ్చే దౌర్భాగ్య పరిస్థితి ఏర్పడినది. ఇప్పుడు మనం ఎస్టేట్సుగా పరిగణించని ఇనాం గ్రామాలు, అగ్రహారాలు, ఖండ్రికలు ఈ చట్టం క్రిందకి పోయే అవకాశం ఏర్పడినది. ఆ విధంగా ఒకొక్క గ్రామంలో—ఇది ఒక గ్రామానికి సంబంధించిన విషయం కాదు, రెండు గ్రామాలకు సంబంధించిన విషయం కాదు—వందల సంఖ్య రైతులకు సంబంధించినటువంటి ఇనాం సమస్య గనుక ఆ రైతులందరికి చెందిన భూములను రైతులకు దక్కేటట్లు చేయడానికి ఆ గ్రామాలను కూడ ఎస్టేట్సుగా పరిగణించునట్లు సవరణ తీసుకురాకపోతే ఇప్పుడు ఆ రైతులందరూ ఏమిచేయాలి ? ఇట్టి సమస్య ఏవిధంగా పరిష్కరించాలి? వాళ్ళను భూములనుంచి వెళ్ళగొట్టడం ప్రభుత్వ ఉద్దేశమా? ఆంధ్ర కౌలుదారీ చట్టం ప్రకారం పండిన పంటలో సగము శిస్తు చెల్లించలేదు కాబట్టి ఇనాం రైతులను భూములనుండి తొలగించమని ఇనాందార్లు తాసీల్దారు కోర్టులో దావాలువేసి డిక్రీలు పొందుతున్నారు. ఈ విషయం ప్రభుత్వానికి తెలియనిదికాదు. రైతులు వచ్చి వెంటనే చెప్పారు. పశ్చిమ గోదావరి జిల్లాలో ఆ విధంగా ఒకటీర్పు అప్పుడే ఇచ్చారు. నరసాపురం తాలూకా, మచ్చికూరపాటి అగ్రహారం గ్రామానికి చెందిన ఇనాందారులు తహసీల్దారు కోర్టులో పిటిషన్లు పెట్టారు. తత్ఫలితంగా తహసీల్దారు రైతులను భూములలోనుంచి తొలగిపొమ్మని తీర్పు ఇచ్చారు. ఇదే విధంగా నెల్లూరు జిల్లాలో గొట్లపాలెం అనే ఇనాం గ్రామంలో వుండే రైతులను కౌలుదారీ చట్ట ప్రకారం సగం మక్తా చెల్లించలేదు కాబట్టి ఆ విధంగా తొలగించమని పిటీషను పెట్టారు. ఆ విధంగా తహసీల్దారు తీర్పు ఇచ్చారు. ఇప్పుడింకా కొన్ని కేసులు తహసీల్దారు కోర్టులో ఉన్నాయి. చెల్లాయిపాలెం, రామదాసు ఖండ్రిక, అప్పాయివారి ఖండ్రిక, ఇవన్నీ కూడా ఇప్పుడు తహసీల్దారు కోర్టులో ఉన్నాయి. వాళ్ళు ఏబదీ రూపాయలో, ఎనిమిదీ రూపాయలో శిస్తు కట్టి పూర్వమునుంచీ ఆ రైతులు ఒకరి దగ్గర ఒకరు కొనుక్కుంటూ, అమ్ముకుంటూ అనుభవిస్తున్నటువంటి భూమిని ఆంధ్ర కౌలుదారీ చట్ట ప్రకారం పండినదాంట్లో 50% మక్తా ఇవ్వలేదు కనుక ఇప్పుడు ఈ రైతులందరిని ఆ భూములలోనుండి వెళ్ళగొట్టి ఈ భూములను మాకు స్వాధీనం చేయాలని తహసీల్దారు కోర్టులో పిటీషనులు పెడుతున్నారు. తహసీల్దారు ఆ పిటీషనులపైన విచారించి "మీరు 50% మక్తా ఇదివరకూ చెల్లించలేదు కనుక, మాకు ఇప్పుడు deposit చేయలేదు కనుక, ఇదివరకు బకాయి ఉన్నారు కనుక, ఈ భూములను వదలి వెళ్ళాలని" తీర్పులు ఇస్తున్నారు. రైతుల వన్నీ ఇవన్నీ ప్రభుత్వానికి తెలియజేశారు. "ఇనాందారుకు, ఇనాం రైతులకు సంబంధించి [illegible], ఈ విధంగా ఆంధ్ర tenancy రైత్వారీ areas కు సంబంధించిన

చట్టం క్రింద రైతులను తొలగించడం ఏమిటి?" అని చెబితే "మళ్ళీ దీని విషయాన్ని ఆలోచిస్తాం, ఆ విధంగా తీసుకోకుండా చేస్తాం" అని శ్రీ కళా వెంకటరావుగారు చెప్పారు. కాని ఎట్టిచర్య తీసుకోలేదు. అక్కడ ఆ విధంగా తీర్పులు జరిగి పోతున్నాయి.

మిస్టర్ స్పీకర్: గౌరవ సభ్యులు చెప్పేది "ఇది చాలదు, ఇంకా కొన్ని చట్టాలు చేయాలనా లేక సవరణలు కావలెననా? ఏమిటి? ఇప్పుడు ప్రభుత్వంవారు పెట్టిన సవరణ బిల్లు గురించి చర్చిస్తున్నాం.

శ్రీ బి. శంకరయ్య: అదే, ప్రభుత్వం ఈ బిల్లు తీసుకొనివచ్చి, "దీనితో ఇనాం సమస్య అయిపోతుందని" చెబుతున్నది. అందువల్ల ఈ చట్టంలోనే దానికి అవకాశం కలుగచేస్తారో మరొక చట్టం తీసుకువస్తారో అది ప్రభుత్వం వైపునుంచి చెప్పాలిగాని నేను చెప్పేదల్లా ఈ రోజునున్న ఇనాం గ్రామాలన్నిటినీ ఎస్టేట్సు చేయుమని మాత్రమే.

*శ్రీ కె. వెంకటరావు: గౌరవ సభ్యులు ఈ చర్చకు కొంచెం సహాయంచేస్తే బాగుంటుందను కొంటాను. గౌరవ సభ్యులు సెలెక్టు కమిటీలో మెంబరు. అక్కడ ఈ విషయాన్ని ఆలోచించి ఏకగ్రీవంగా ప్యాసుచేసిన వారిలో వారొకరు. అందువల్ల ఇదివరకు వారికి తెలియనివి కావు. ఈ చట్టంలో లేవనుకునే విషయాలు ఇప్పుడు వారికి చెప్పేదిగాని ఇదివరకు ఆలోచనలో లేనటువంటి విషయాలుకాని లేవు. కాని చర్చతగ్గించడానికి ఒక విషయం మాత్రం ఖండితంగా చెబుతున్నాను. ఇనాం గ్రామం అని పట్టా ఇవ్వబడి ఇనాం గ్రామంలో కాకుండా రైత్వారీ గ్రామంలో ఇవ్వాళ చేరివున్నప్పటికీ కూడా ఖండ్రిక అయివుండి మొట్టమొదట ఇనాం గ్రామం పట్టా ఉండినట్టి ఏ ఎస్టేటయినా ఈ చట్టంతోటి రేపు ప్రొద్దునవచ్చే చట్టంతోటి పూర్తిగా రద్దవుతాయి. ఇంక మిగిలిన ప్రపంచంలోవుండే అన్ని ఇనాంలు ఇనాం కానటువంటివి అన్నీ మాకే కావాలని పోటీ కనుక పెట్టినట్లయితే ఈ చట్టాలు వారికి వర్తించవు. ఇనాం గ్రామం అని సృష్టిమొదలు కాని ఇప్పటివరకు ఎవరయినా పట్టా ఇచ్చినట్లయితే అది దీని క్రిందరద్దయిపోతుంది. ఇనాంగ్రామం definition లో ఉన్నటువంటి తేడాలన్నీ ఇంతవరకు కోర్టులో ఇచ్చినటువంటి తీర్పుల ప్రకారం అన్నీ సర్దబడ్డాయి. ఇది రెండవ విషయం. మూడవ విషయం ఏమిటంటే గౌరవ సభ్యుల అభిప్రాయం మామూలుగా మనం ఇనాం అనే శబ్దాన్ని కొంచెం విపులంగా వాడు తున్నాం. అది కనుక అయినట్లయితే ఎస్టేటు కానటువంటి, గ్రాంటు కానటువంటి, పట్టా ఇవ్వ నటువంటి, దానం ఇవ్వనటువంటి ఇనాంలు మాత్రం దీని క్రిందకి రావు. తరువాత ఆంధ్ర Tenancy Act క్రింద eviction notices ఇస్తున్నారన్నారు, అది కూడా definite గా చెబుతున్నాను. ఆంధ్ర Tenancy Act క్రింద Estate అయినటువంటి ఏ గ్రామానికి కూడా ఇవ్వాళగాని, రేపుగాని apply కాదు. అందుకోసం చట్టంలో కూడా 1948 వ సంవత్సరం దగ్గరనుంచి ఎప్పుడైనా ఒకప్పుడు ఇనాం గ్రామం రైతు అయి నట్లయితే అతనిని తొలగించడానికి వీలులేదని ఈ చట్టంలో నిర్ణయం జరిగింది. అయినా ఈ జవాబు చర్చచివర చెప్పవచ్చునుగాని, మాటకు చెబుతున్నాను. ఆయన ఊరికే లక్షలకొలది కోట్లకొలది అని అంకెలు చెబుతున్నారు. ఉమ్మడి మదరాసు రాష్ట్రంలోనే అన్నిరకాల

ఇనాం క్రింద 66 లక్షల ఎకరాల భూమికంటె ఎక్కువ ఉండదు. ఆంధ్ర రాష్ట్రం విడి పోయింది. ఈ రోజున 62 లక్షల ఎకరాలు ఎక్కడనుంచి వచ్చిందో తెలియదు. 25 లక్షల ఇనాం రైతులు ఎక్కడికి పోతున్నారో తెలియదు. ఊరికే సున్నలు గుణించుకు పోవడంవల్ల సమస్యను నిర్ణయం చేయడంతప్ప మరేమీ కాదని మనవి చేస్తున్నాను. మిగిలిన విషయంలో ఏ విధంగాను అనుమానంలేదు. నేను చెప్పిన ప్రకారమే ఈ చట్టం నడుస్తుంది.

మిస్టర్ స్పీకర్ : మీరు చెప్పిన ప్రకారమే 1908 వ సంవత్సరంలో కొన్ని ఇనాంలు ఎస్టేట్లయినాయి. అప్పుడు ఊరికే మేలువరం వున్నది. 1936 వ సంవత్సరం లో మేలువరం కుడివరం ఉన్నా కూడా ఎస్టేట్సు అయినాయి. ఖండిక్రికలను హోమ్లెట్లను, మిగిలిన వాటిని మొన్న ఎస్టేట్సు చేశారు. ఇవిగాక యింకా యేమైనా యినాం గ్రామాలున్నాయంటారా? లేక మైనరు ఇనాంల నుండి రైతులను వెళ్ళగొడతారా? శిస్తు యివ్వకపోతే Tenancy Act ప్రకారం అంటే ఇది నాకు అర్థం కావడం లేదు. సభవారి కర్థమైతే బాగుం టుంది.

శ్రీ బి. శంకరయ్య : ఆ విషయమే మనవి చేస్తున్నాను. ఇదే విషయాన్ని యిదివరకే శ్రీ వెంకటరావుగారు "రైత్వారీ గ్రామాలకు అనుబంధముగా గర్భకండ్రికలు ఒకటో రెండో గ్రామాలుంటాయి. వాటికి సంబంధించి సవరణ చట్టము తెస్తాను" అని చెప్పినారు. లిస్టు కావాలంటే చదువుతాను. శ్రీ వెంకటరావుగారు చెప్పినట్టుగా ఒకటి రెండు కాదు. 1908 వ సంవత్సరపు చట్టం క్రిందికి రాకుండ, 1936 సంవత్సరపు చట్టం క్రిందికి రాకుండ 1956 సంవత్సరపు చట్టం క్రిందికి రాకుండ, ఉండే టటువంటి ఇనాం గ్రామాల సంఖ్య ఎక్కువగా వుంది. ఇవ్వాళ ఒక కమిటీని వేసి ఆంధ్ర దేశంలో ఏ జిల్లాలో విచారించినా స్పష్టమవుతుంది.

మిస్టర్ స్పీకర్ : ఎందువల్ల ఆ విధంగా వున్నాయి?

శ్రీ కె. వెంకటరావు : అసలది ఇనాం ఎస్టేటు ఎప్పుడూ కాకపోబట్టి అసలు ఇనాం లెజిస్లేషనులో గాని, జమీందారీ లెజిస్లేషనులోగాని scope లో 1908 వ సంవత్సరం మొదలుకుని యివ్వాళ వరకు ఎప్పుడూ, అనుకోనటువంటివి పోడుగువా వుంటే వుండవచ్చు, ఇనాం గ్రామం అనే పట్టా ఫలానా వెంకయ్య అగ్రహారం ఫలానా వారికిచ్చాము, మాలపల్లిని యింకొకరికి యిచ్చాము, యీ నిర్ణయంతోటి ఎప్పుడైనా చరిత్రలో పట్టా గనుక పుట్టిఉన్నట్టయితే, వ్రాసినట్లయితే అది యివ్వాళ ఏ services లో వున్నాసరే, అది రైత్వారీ గ్రామానికి శివారు అయివుండవచ్చు. జమీందారీ గ్రామానికి శివారై వుండవచ్చు. ఇనాం గ్రామం క్రింద ఉండనివ్వండి. Whole inam estate definition క్రింద రావని, కొన్ని point out చేసినటువంటి లోపాలన్నిటిని సవరించి most comprehen-sive గా చేసి యిక్కడికి తీసుకు వచ్చాము. నేను గత పదిహేను రోజులనుంచి అదే దృష్టితో వున్నాను. ఎందుకంటే ఆఖరు stage వచ్చింది. ఒక విషయం శంకరయ్య

గారితో అంగీకరిస్తున్నాను. ఆయన భావంలో గ్రాంటు అక్కరలేదు. ఇదివరకే రైత్వారీ గ్రామం అయిపోయినా సరే యినాం గ్రాంటు అప్పుడు యివ్వకపోయినా సరే రైత్వారీ గ్రామంలో వున్నటువంటి ఇనాం ఖండ్రికలుగాని, ఇనాంలుగాని, ఎస్టేట్ల క్రిందికి తీసుకురావాలనే భావం అయినట్లయితే, ఇది వేరే విషయం.

శ్రీ పి. సుందరయ్య : అదివరకు ఇనాంలు గ్రామంలో భాగముగా పరిగణించబడక పోవచ్చు. ఇవన్నీ కూడా ఇనాం గ్రాంట్లు రైత్వారీ గ్రామాల క్రింద, కోసుగ్రామాల క్రిందవున్నప్పటికీ కూడా ఒక గణనీయమైన భూమిని యినాముగా యిచ్చి ఉన్నట్లయితే దానిని ఎస్టేటుగా పరిగణించడానికోసము యింతవరకు 1908 వ సంవత్సరంలో గాని, 1936 వ సంవత్సరంలో గాని, 1956 వ సంవత్సరంలోగాని చేయకపోతే అక్కడ ఎక్కువ మంది ఇనాం రైతులు యీ శిస్తు మాత్రం కట్టుకుంటూఉంటే రైతుల హక్కులను రక్షించడానికి ఎందుకు చర్య తీసుకో కూడదు ? అటువంటి వారు లేరనా ప్రభుత్వ వాదన ?

శ్రీ కె. వెంకటరావు : అటువంటివి ఉన్నప్పటికీ అవి ఎస్టేట్లు కావు కనుక అవి ఇనాం గ్రామాలని పట్టాలు లేకపోవడంవల్ల నిజంగా జిరాయితీ భూములకు ఉన్న స్వరూపమే వాటికి వుండడంవల్ల అది ప్రభుత్వ దృష్టిలో ఎస్టేట్లు అప్పుడూ కావు, ఇప్పుడూ కావు, ఇక ముందు కూడా కావు.

మిస్టర్ స్పీకర్ : ఎస్టేటుగా చేస్తారా మీరు ? అంటారు వారు ?

శ్రీ జి. లచ్చన్న (సోంపేట) : మరొక సవరణ చేయాలని కోరుతున్నాను. ఎస్టేట్లకు సంబంధించిన ప్రాంతాలలో ఏ గ్రామానికి చెందినటువంటి ఇనాం అయినా ఇపుడు ఈ రోజు వచ్చే సవరణ చట్టంవల్ల ఎస్టేటు క్రిందకు వచ్చి రద్దు అయిపోయే అవకాశం ఉన్నదనే విషయం మంత్రిగారు స్పష్టపరిస్తే బాగుంటుంది.

శ్రీ కె. వెంకటరావు : నేను పూర్తిగా స్పష్టపరుస్తున్నాను. లచ్చన్నగారు చెప్పిన విషయంతో నేను ఏకీభవిస్తున్నాను. అదీ సాధ్యం అవుతుందని, సాధ్యం అయినదనే దృష్టితోనే ఈ సవరణ చట్టం తీసుకురావడం జరిగింది.

మిస్టర్ స్పీకర్ : సుందరయ్యగారు చెప్పినదానివల్ల నాకు అర్థమైనది ఏమిటంటే ఖండ్రిక, hamlet అని కాకుండా, ఒక గ్రామంలో కొంత భాగం not a small minor portion but a considerable portion ఇనాములుగా ఇవ్వబడి ఉంటే వాటిని ఎస్టేట్లు చేయలేదు, అట్లా చేస్తేనేకాని abolition పూర్తి అయినట్లు కాదని.

శ్రీ కె. వెంకటరావు : వాటిని చేయము అని సమాధానం చెప్పాను. అటువంటి వాటిని చేసే ఉద్దేశం 1908 నుంచి ఇప్పటివరకు వచ్చినవి ఏశాసనంలోను లేదు. అటువంటి ప్రయత్నం జరుగలేదు. That is not the policy of this Government. Grant ఉన్న ఖండ్రికలు ఎక్కడ ఉన్నా abolish చేస్తాము. కాని ఎప్పుడూ పట్టా లేకుండా ఒక గ్రామంలో

ఏ 100 ఎకరాలో ఈనాం భూమి ఉంటే వాటిని ఎస్టేట్ల క్రింద పరిగణించే ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : ఇప్పుడు వెంకటరావుగారు గవర్నమెంటు గ్రామాలలో ఉండే ఈనాం భూములను గురించి చెప్పారు. నేను raise చేసే point అది కాదు. ఈనాం గ్రామమే ఉంటుంది, ఈనాం ఇచ్చినపుడు కొంత భూమి ఇవ్వకుండా ఉంటే అది ఈ నిర్వచనం క్రిందకు వస్తుందా ?

శ్రీ కె. వెంకటరావు : Complete గా వస్తుంది ; వెంకటేశ్వర్లుగారి ప్రశ్నకు జవాబు yes.

శ్రీ బి. శంకరయ్య :—అధ్యక్షా, ఈ బిల్లు సెలక్టు కమిటి దశలో ఉండగానే వెంకటరావు గారికి అన్ని విషయాలు చెప్పాము. గ్రామాల లిస్టుకూడా ఇచ్చాము. ఉదాహరణలు కావాలంటే వాటిన్నైదు చెబుతాను. వడుగుపాడు అని ఒక గ్రామం వున్నది. అందులో 1000 ఎకరాలు ఇనాం గ్రాంటు వున్నది. రైత్వారీ గ్రాంటు కాదు. గవర్నమెంటు గ్రామానికి సంబంధించిన గ్రాంటు కాదు. గవర్నమెంటు గ్రామానికి 1000 ఎకరాలు ఒకటి వుంది. 70 ఎకరాలు ఒకటి వుంది. వడుగుపాడు ఎస్టేటు కాదని తీర్పు చెప్పారు. అది ఇనాం గ్రామమే కాని గ్రాంటు 1000 ఎకరాలు ఇచ్చినా ఇచ్చేటప్పుడు వడుగుపాడు అని పేర్కొన లేదట.

మిస్టర్ స్పీకర్ :—అది whole inam గ్రామమా ?

శ్రీ బి. శంకరయ్య :—అందులో 1000 ఎకరాలు ఇనాం ఇచ్చారు. ఇది ఎస్టేటు కాదు అన్నారు. 70 ఎకరాలు సత్రం వారికి ఖండ్రిక అని వున్నది. కాబట్టి దానిని ఎస్టేటు క్రిందకు తీసుకు రావడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఈ 1000 ఎకరాల సంగతి ఏమిటి ? అది ఈనాం గ్రామం అంటారా ? గవర్నమెంటు గ్రామం అంటారా ?

మిస్టర్ స్పీకర్ :—Granted or confirmed అంటూ లేదు కాబట్టి, వడుగుపాడు అని పేర్కొన లేదు కనుక, అది ఎస్టేటు కాదన్నారు.

శ్రీ బి. శంకరయ్య :—1000 ఎకరాలను ఒకటి గ్రాంటుగా ఇనాంగా పట్టా ఇచ్చారు గవర్నమెంటు రిజిష్టర్లలో ఈనాం గ్రామము అని వున్నది.

మిస్టర్ స్పీకర్ :—1908 Act లోను, 1936 Act లోను వచ్చి వుండాలి కదా !

శ్రీ బి. శంకరయ్య :—ఎస్టేటు కావాలంటే గ్రామాన్ని గ్రాంటుగా ఇవ్వాలి made, confirmed, అని వుండాలంటారు. ఈనాం రైతులను రద్దు చేసి ఈనాం దారులకు భూములు ఇప్పించాలన్నప్పుడు 'as designated in the Government registers' అని వుంటే చాలునంటున్నారు. ఈనాం గ్రామము అని వున్న తరువాత 'designated as inams in Government registers'—అనే

ఎస్టేట్లు అవుతాయి అని పెడితే అన్ని ఈనాం గ్రామాలు ఎస్టేట్ల క్రిందకు వస్తాయి. ఇలా వుంచాలని సెలక్టు కమిటీలో అడిగితే ఎందువల్ల కళా వెంకటరావుగారు ఒప్పుకోలేదు? ఇదివరలో సెలెక్టు కమిటీలో pass చేసిన దానిని ప్రభుత్వం ఎందుకు ఒప్పుకోలేదు? అన్ని ఇనాములు ఎస్టేట్లు అవుతాయని లచ్చన్నగారితో ఏకీభవిస్తున్నానని ఇప్పుడు అంటున్నారు. అది సరికాదు. చెల్లాయిపాలెం నుంచి వెంకటరావు గారిదగ్గరకు మూడు మారులు రాయబారం వచ్చారు. ఆ గ్రామంలోని 800 ఎకరాలలోను 790 ఎకరాలు ఒక గ్రాంటు; 10 ఎకరాలు ఒక గ్రాంటు; 790 ఎకరాలకు సంబంధించినరైతులకు ఎకరానికి రూ. 9, 10 లు చొప్పున గవర్నమెంటు గ్రామాలలో మాదిరిగానే ఈనాందారుకు శిస్తు చెల్లించుకుంటూ వారే ఆ భూములను అమ్ముకుంటూ, కొనుక్కుంటూ తరతరాలనుంచి అనుభవిస్తున్నారు. కాని అది ఎస్టేటు కాదు అని హైకోర్టులో తీర్పు ఇచ్చారు. ఈ విషయమై సుప్రీం కోర్టుకు వెళ్ళియున్నారు. ఇప్పుడు ఇనాందారు ఆంధ్ర కౌలుదారీ చట్టం ప్రకారం పండిన పంటలో 50% చెల్లించడం లేదు కాబట్టి ఆ రైతులను భూముల నుంచి వెళ్ళగొట్టాలని పిటిషన్లు పెట్టారు. ఎన్ని మారులో ఈ విషయమై వెంకటరావు గారికి చెప్పాము.

*శ్రీ కె. వెంకటరావు : ఎన్నిమారులో చెప్పినమాట నిజం. ఇంతవరకు ఆ జడ్జిమెంటు నాదగ్గరకు తీసుకురాలేదు. శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు నాకు సాక్ష్యం. ఎన్ని మారులైనా శాసన సభలో కూర్చుని అరవడం తప్ప—అరవడం అంటే తప్పుమాట క్రింద చెప్పడంకాదు; నెల్లూరు జిల్లా భాషలో మాట్లాడుతున్నాను—చెప్పడంతప్ప వందమారులు స్వయంగా కోరినా జడ్జిమెంటు నాదగ్గరకు తీసుకురాలేదు. మరల చెబుతున్నాను. అధ్యక్షుల వారు ఈ ఎస్టేట్ల విషయమై చాలా తెలిసినవారు "Made, confirmed and recognised by the British Government" అన్నారు. 1860 లిస్టులో చేరివుండే ఇనాం ఎస్టేట్లు అన్నారు. నేను క్రొత్తగా బ్రిటిషు గవర్నమెంటును తీసుకురాలేదు. Made, confirmed అనే వ్యవహారం ఇప్పుడులేదు. ఇకమీద భూసంస్కరణలు వచ్చి క్రొత్త చట్టాలువచ్చి రైత్వారీ గ్రామాలను ఇనాం ఎస్టేట్ల మాదిరి చేయాలనే పరిస్థితివస్తే వాటిని తీసుకుంటారేమో నాకు తెలియదు. ఈ రోజున ఒక సమగ్రమైన విషయంతో వస్తున్నాను 1947 లో ఎస్టేట్ల రద్దు చట్టం వచ్చినపుడు కొన్ని గ్రామాలను ఆరోజున రద్దుచేయకుండా వదలి పెట్టాము—అనేక కారణాలచేత. తరువాత వచ్చిన జడ్జిమెంటులనుబట్టి అసమగ్రంగా ఉన్న ఇనాం గ్రామాలను కూడా ఎస్టేట్ల క్రింద 1956 లో చేశాము. మొన్న ఈ "In such inam village" అన్న సమస్యపై హైకోర్టు comment చేశారు. జడ్జిమెంటు కూడా చెప్పలేదు. In such inam village అనడంవల్ల such అనేమాట ఉపయోగించకుండా ఇనాం గ్రామాలలోని hamlet అని చెప్పడంవల్ల దానిని కూడా మార్చడానికి ఈ బిల్లులోను, తరువాత బిల్లులోను ప్రయత్నంచేసి ఆ lacuna కూడా తీసివేయడానికి ప్రయత్నం చేస్తున్నాము. నాదృష్టికి తోచినంతవరకు, నా అనుభవానికి సంబంధించినంతవరకు, ఇనాం పట్టాపొంది ఈ నిర్వచనంలోనికివచ్చి ఏ కోర్టు యొక్క న్యాయం వల్లనో, అన్యాయంవల్లనో exclude అయినట్లయితే, అటువంటివి ప్రభుత్వదృష్టికి

పై కోర్టువల్లకాని, సభ్యులవల్లకాని వస్తే, దీనితో ఈ సమస్య పూర్తి అవుతుందని చెప్పినప్పటికిని ఎన్ని సవరణలు అవసరమైతే అన్నింటిని తీసుకురావడానికి సిద్ధంగా ఉన్నాను.

మిస్టర్ స్పీకర్: ప్రస్తుత చట్టం scope ఇంతేకనుక మిగతా ఇనాముల విషయమై ఇందులో ఎట్లాగాచేయరు. తరువాత సభ్యులు మాట్లాడ వచ్చును. ప్రజాభిప్రాయాన్ని create చేయవచ్చును. ప్రస్తుతం made, confirmed and recognised అనే old theory ని ఐక్సెప్టు చేస్తారు. అందుచేత ఈ విషయమై మాత్రమే మాట్లాడితే మంచిది.

శ్రీ బి. శంకరయ్య: వారు మనకు తప్పు సమాచారం ఇచ్చినపుడు ప్రజలకు న్యాయం కలుగచేయాలికదా! దీనివల్ల ఈనాం గ్రామాలన్నీ ఎస్టేట్లు కావడంలేదు; ఇనాం రైతులకు నష్టం కలుగుతోంది—అనే విషయం తెలియ చేయాలికదా.

మిస్టర్ స్పీకర్: ఇందులో ఉన్నదానినే సవరించారు. 1908 లో మేలువరం, కుడివరం hamlets అనే ఈ మూడు సవరణలే వచ్చాయి. కాని fundamental principles వెనుకకు పోయిన legislation ఇంకాలేదు. అటువంటివి భూసంస్కరణలలో రావచ్చును. ఈ లోగా శాసన సభ్యులు, ప్రజలు ఆందోళన చేయవచ్చును. ఇపుడు చేసేది ఏమీలేదు.

శ్రీ బి. శంకరయ్య: ఇదివరకు ప్రకాశంగారి ప్రభుత్వంలో ఈ సమస్యను వివరంగా చర్చించారు. ఆంధ్రదేశంలోవున్న ఇనాం గ్రామాలన్నింటిని ఎస్టేట్ల క్రింద ఏవిధంగా తీసుకురావాలని ఆలోచించారు. అంతలో ప్రభుత్వం పడిపోవడంవల్ల గవర్నరుగారు ఆర్డినెన్సు తీసుకువచ్చారు. గ్రామంలో substantial portion ఇనాంగా ఉన్నపుడు ఆ రైతులకు రక్షణ కలుగజేశారు. అంతేకాకుండా 1954 గవర్నరుగారు ఆర్డినెన్సు లో మజరాలు, కండ్రికలకు కూడ ఆర్డినెన్సు వర్తింపజేశారు. 1954 లోనే ప్రసిడెంటు చట్టం క్రింద వచ్చింది. దీనివల్ల ఇనాం గ్రామాలలోని పొలాలలోవున్న 50, 60 లక్షల మంది రైతులను ఇనాందారులు వెళ్ళగొట్టకుండా రక్షణ కలిగింది. 1955 లో వేసిన సెలక్టు కమిటీ చిన్న మైనర్ ఇనాములు వాకిరి ఇనాములుతప్ప మిగిలిన grants అన్నింటికి చట్టం వర్తించాలని ప్లాన్ చేసినది. ఇనాం గ్రామాలన్నింటికి ఈ సవరణ చట్టం వర్తిస్తుందని. ఇనాం గ్రామాలన్నీ ఎస్టేట్లు అవుతాయని, ఈసమస్య పరిష్కారం అవుతుందని, ఇనాం రైతులు ఆశతో ఉండే సమయంలో సెలక్టు కమిటీ ప్లాను చేసినదానిని వెంకటరావుగారు తిరుగ తోడి ప్రభుత్వం ఒప్పుకోవడంలేదని ఆవిధంగా చట్టం రాకుండా వేరేరూపంలో తెచ్చారు. దీనివల్ల ఇనాం గ్రామాలలోని రైతులందరికి ఆశాభంగం కలిగింది. ఈ సమస్య పరిష్కారం అయ్యే అవకాశం కలుగకుండా పోయింది.

ఇది నేను తయారుచేసిన list కాదు. 1955 లో సెలక్టు కమిటీలో మనం చర్చించిన తరువాత నెల్లూరు జిల్లా కలెక్టరేట్ వారు ఒక list తయారు చేశారు. List of

inam villages which would become estates under the Estate Land Act. Andhra Amendment Act, 1956 లో substantial portion అయితే ఒప్పుకొని pass చేస్తామని ఆ list తయారు చేశారు. ఒక్కొక్క తాలూకాలో ఎన్ని ఎన్ని గ్రామాలు వున్నాయో ఆ list లో ఇచ్చారు. వాళ్ళు తయారు చేసిన ఆ list లో 120 కు పైగా గ్రామాలు వున్నాయి. ఈ గ్రామాలన్నీ ఎస్టేట్ల క్రిందకు వస్తాయని 1956 అక్టోబరులో వారు చెప్పారు. హామీ ఇస్తున్నామని చెప్పారు. అయినా యింకా ఎందువల్ల ఎస్టేట్ల క్రింద ప్రకటన కాలేదని అడిగితే దానికి సమాధానం చెప్పటము లేదు. చెల్లాయిపాలెం విషయంలో నేను జడ్జిమెంట్ తీసుకురాలేదని వెంకటావ్రుగారు అన్నారు. చెల్లాయి పాలెంలో వుండే రైతులు, లచ్చన్నగారు స్వయంగా అక్కడి గ్రామంలో జరుగుతున్న అన్యాయాలను వెంకటరావుగారికి తెలిపారు. "బెజవాడలో కలెక్టర్ల కాన్ఫరెన్సు జరుగుతుంది. అక్కడ ఆ విషయం చెబుతాను" అని వెంకటావ్రుగారు వారికి సమాధానం చెప్పారు. ఆ తరువాత కలెక్టరును కలుసుకొంటే "వెంకటరావుగారు ఆ విషయం మాకు చెప్పలేదని" చెప్పారు. ఈనాం గ్రామాలన్నీ ఎస్టేట్లుగా చేయాలని Andhra Provincial Congress Committee తీర్మానించింది. Made అనో, confirmed అనో వర్ణించినవి కాకుండా తక్కిన ఈనాం గ్రామాలలో వున్న రైతులను వెళ్ళగొట్టాలని ఆంధ్రకాంగ్రేసు కమిటీ తీర్మానించలేదు. ఈనాం గ్రాంటులను రాజులకుగాని, మరి ఎవ్వరికిగాని ఇచ్చినప్పుడు శిస్తు వసూలు చేసుకొనే అధికారం మాత్రమే వారికి ఉంది. భూములనుండి రైతులను వెళ్ళగొట్టి వారి భూములు స్వాధీనం చేసుకొనే అధికారం లేదు. ఇప్పుడు ఆ భూములను ఇనాందార్లకు పట్టాలు ఇచ్చి, రైతులకు భూమి లేకుండా చేయడం న్యాయంకాదు. ఇనాం సమస్య అనేది కేవలం మేలువరానికి సంబంధించినది. కుడివరం వున్నదని వ్రాసి యిచ్చినప్పటికి లెక్కలేదని 1956 లో పాస్ చేశారు. చట్టం చేసి సంవత్సరమైనా ఇంతవరకు ఎన్ని గ్రామాలను ఎస్టేట్లు చేశారు? మిగతావి ఎందుకు చేయటం లేదు?

*శ్రీ కె. వెంకటరావు: శంకరయ్యగారు ఎందుకు ఇంత బాధ పడుతున్నారో తెలియుటలేదు. గవర్నమెంటు వారు ఎప్పుడూ inam villages list publish చేయరు. చేసే అధికారం వారికి లేదు. ఫలానాది ఈనాం గ్రామమని శాసనం చేస్తారు. అది ఈనాం గ్రామం అవునా, కాదా అని రైతులు, జమీందార్లు, ఇనాందార్లు తెలుసుకొనే విషయం. ఏవో చేయకుండా మరి ఏవో చేస్తున్నట్లు implications పెట్టటం వల్ల ప్రయోజనం వుండదు. ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ ఏ తీర్మానం పాస్ చేసినది నాకు తెలుసు. చిరకాలం నేను సెక్రటరీగా పనిచేశాను. ఇటువంటి విషయాలు నేనే వ్రాసే వాడిని. ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ ఇంతవరకు చెప్పిన ప్రతి విషయాన్ని ఇంతవరకు తెచ్చిన బిల్లుల ద్వారా అమలు చేశానని చెబుతున్నాను. ఏది చేశానో ఏది చేయలేదో చెప్పవలసింది ఈ ప్రక్కన కూర్చుని వున్న కాంగ్రెస్ సభ్యులు. కాని, opposition లోని వారైన శంకరయ్యగారు కాంగ్రెస్ కమిటీ చేసిన తీర్మానం గురించి బాధ పడ నక్కరలేదు. ఇంకా ఎక్కువ చేయుమని చెప్పవచ్చు. నేను ఎన్నిసార్లు చెప్పినా చెల్లాయిపాలెం జడ్జిమెంటు శంకరయ్యగారు తీసుకురాలేదు. వారు ఇప్పటికైనా జడ్జిమెంటు తెస్తే, గవర్నమెంటు తప్పు చేస్తే amendment తీసుకువస్తానని నేను మనవి చేస్తున్నాను.

*Mr. Speaker :* Any inam village of which land revenue alone has been granted or both varams are granted, made, confirmed or recognised by the British Government.

Whether made, confirmed or recognised by the British Government or not, whether the inamdar owns kudivaram or melvaram or not, all inam villages will become estates as per this amendment if I have understood correctly.

*శ్రీ కె. వెంకటరావు : ఇంతవరకు వున్న scheme of legislation ప్రకారం మేము ఇచ్చిన definition వల్ల కాని, చేసిన చట్టంలో కాని లోటు వుంటే, అన్యాయం జరిగితే నేను amendment తీసుకురావటానికి ఏ విధమైన అభ్యంతరము లేదు. ఇంతకంటే ఏమి నేను చెప్పలేను. "Inam village may be confirmed or recognised by British Government" అనే మాటలు ఉపయోగించటానికి కారణంవుంది. 1860 సంవత్సరంలో ఇనాము గ్రామాలకు గ్రాంటు ఇవ్వటం జరిగింది. అప్పుడు ఏవిధమైన అధికారములేనివారు కూడా, ఇనాం గ్రామాలను ఇవ్వటము మొదలు పెట్టారు. దీనిని check చేయటానికి ఇనాం కమీషను 1860 లో appoint చేసి, "ఇంతవరకు ఉన్నవారికి ఏ ఏ హక్కులు ఉన్నాయో మాకు చూపించాలని, అట్లుచేస్తే వారికి మేము పట్టాలు ఇస్తామని" వారికి చెప్పారు. దాని ప్రకారము ఎవరికి ఉన్న హక్కులు వారు చూపించారు. చూచిన దానితో ఒక list తయారు చేశారు. "ఫలానా గ్రామంలో ఈ రకమైన పట్టాలు 1860 వరకు ఇవ్వబడ్డవని చెప్పారు. వానిని మేము ఒప్పుకొన్నాము. ఒప్పుకోవటమేకాక confirm చేస్తున్నాము" అని కూడా చెప్పారు. 1860 లో పొరపాటున చేరనిగ్రామాలను కూడా మళ్ళీ దరఖాస్తు పెట్టుకొంటే బోర్డు ఆఫ్ రెవెన్యూవారు "as a inam village" అని recognise చేశారు.

ఇనాం అనేదానిని ఎప్పుడైనా దానం ఇచ్చారా లేదా అనేది ఇప్పుడున్న ప్రశ్న. కొందరు ఉట్టి అగ్రహారాలు ఇచ్చారు. సర్వదుంబాళా అగ్రహారాలు ఇచ్చారు. తాంబూలం ఇచ్చినందుకు ఇచ్చారు. రాత్రి భోజనం పెట్టినందుకు ఇచ్చారు. ఒకాయన గడ్డి పచ్చడిచేసి మహారాజావారికి రాత్రి అతిరుచిగా భోజనం పెట్టినందుకు గరికిపలస అనే గ్రామం ఇచ్చారు. ఆ విధంగా అనేక రకాలుగా ఇచ్చారు. అయితే వీటన్నింటికి ఒకే test ఉన్నది. దానం ఇచ్చేటప్పుడు ఆయనకు పన్ను వసూలు చేసుకునే హక్కు ఇచ్చారా, లేక పొలందున్నుకొని పండించుకొనే హక్కు ఇచ్చారా అనే విషయంమీద ఈ తగదా అంతా వచ్చింది. పన్ను వసూలు చేసుకొనే హక్కు ఇచ్చారని చెప్పిన ఇనాములను ఎస్టేట్సుగా 1908 లోనే పరిగణించడం జరిగింది. పన్ను వసూలు చేసుకొనే హక్కు కూడ ఇచ్చినట్లయితే రైతు ఒక ఏడాది శిస్తును ఇనాందారుకు చెల్లించినట్లయితే ఇనాందారుకు ఉన్న భూములు కూడా ఎస్టేట్సు అవుతాయని 1936 లో చెప్పారు.

తరువాత వచ్చిన తగాదాలు ఈ రెండు విషయాలను గురించికాదు. కొన్ని గ్రామాలను ఇనాం గ్రామాలని అన్నారు. మరికొన్నిటిని ఇనాం పట్టా ఇచ్చిన గ్రామాలని అన్నారు. ఒక గ్రామంలో 500 ఎకరాలు ఉన్నట్లయితే, 490 ఎకరాలు ఒకరికిచ్చి, 10 ఎకరాలు ఇంకొకరికి పట్టా ఇస్తే అది 'whole inam' కాదు అని జడ్జిమెంటు చెప్పారు. అంతేకాక ఆ గ్రామంలో పుంతలు, పోరంబోకులు ఉన్నాయి. అదీ ఎవరికీ పట్టా ఇవ్వలేదు కనుక అది 'whole inam village' కాదు అన్నారు. తరువాత నేను 500 ఎకరాలు ఇచ్చిన మాట నిజమే, కాని మేము లిస్టులోనికి తీసుకొనేనాటికి ఆయన ఇంకొకరికి 200 ఎకరాలు దానం ఇచ్చారు. ఇవి రెండు పట్టాలు క్రింద గవర్నమెంటువారు అప్పుడే విడదీశారు కనుక అది 'whole inam village' కాదు అన్నారు కొందరు. ఇటువంటి అడ్డంకులను తొలగించడానికి 1945 లో అడ్వయిజరీ ప్రభుత్వం ఈ శాసనానికి ఒక సవరణను చేశారు. దాని ప్రకారంగా ఒక గ్రామంలో ఇనాం గ్రామం అని చెప్పినప్పుడు తరువాత దానిలో ఎన్ని పట్టాలు ఉన్నప్పటికి, ఎన్ని భాగాలు చేసుకొన్నప్పటికి దానిలో ఒకభాగం ఇంకొకరికి దానం చేసినప్పటికి అదీ ఎస్టేటు అవుతుందని అన్నారు. అయితే ఆ సవరణ చట్టంలో ఇచ్చిన డెఫినిషన్ సరిపోదు అని కోర్టులు అన్నాయి. ఆ సవరణ చట్టంలో 'village' అని ఉన్నది కనుక a hamlet cannot be a village ఖండ్రికలుగాని, మజరాలుగాని ఇనాం గ్రామాలు కాదని మరల ఇంకొక తగువు లేవదీశారు. అందువల్ల పదీ ఏళ్ళ తరువాత 1956లో ఒక శాసనం చేయవలసి వచ్చింది. దాని ప్రకారంగా ఖండ్రికలుగాని, మజరాలుగాని ఎస్టేట్లు అవుతాయని శాసనం చెప్పాము. అయితే ఇందుకు సంబంధించిన క్లాజులో 'such village' అని ఉన్నది. ఈ మాటలలోని 'such' అంటే ryotwari village కాదని, inam village అవుతుందని ఈ మధ్యన ఒక comment వచ్చినది. అయితే దీనిని కూడా సర్దుబాటు చేయడానికిగాను "such" కి బదులు any village granted in inam అని సవరణ పెట్టాము. దీనిలోని 4 వ క్లాజులో కూడా same effect వచ్చేటట్లుగా ఒక సవరణ ప్రభుత్వం తరఫున ప్రతిపాదిస్తున్నాము. మా దృష్టిలోనికి వచ్చినంతవరకు ఏవిధమైనటువంటి కష్టము లేకుండా చేయదలచు కున్నాము. ఎప్పుడైనాసరే ఇనాం అనేశబ్దం యొక్క నిర్వచనం క్రింద పట్టా ఇవ్వబడినట్లు ఋజువు ఉన్నట్లయితే అవన్నీ ఎస్టేట్లు అయి ఆ ఇనాంలన్నీ రద్దు అయిపోతాయి.

మద్రాసు రాష్ట్రంలో రైత్వారీ సెటిల్‌మెంటు జరిగింది. రైత్వారీ గ్రామాలుగా సెటిల్ చేయబడినవాటిలో ఎవరైతే తన భూమిని ఎవరికైనా "దీనిని నీకు దానం క్రింద ఇచ్చాను." అన్నట్లయితే అది ఎస్టేటుకాదు. అయితే అట్టి భూములను కూడా ఇనాం రద్దు చట్టంలో చేరిస్తే బాగుంటుందేమోనన్న భావం కొందరికున్నమాట నిజమే. కాని రైత్వారీ గ్రామాలను ఎప్పుడు కూడా ఇనాం గ్రామాలుగా భావించడం జరుగలేదు. వాటిని ఇనాం ఎస్టేట్లు క్రింద తీసుకొని రావడానికి వీలులేదని ఇదివరకటినుంచి ఉన్న అభిప్రాయం అయితే ఎప్పుడైనా పాతరికార్డులలో ఇనాం గ్రామమని చెప్పినవాటికి ఎట్టి అభ్యంతరాలు తెలిపినా, వాటిని అంగీకరించడానికిగాను

తగినటువంటి సవరణ బిల్లులను తీసుకొని వస్తామని హామీ ఇస్తున్నప్పటికి దీనిమీద ఇంకా చర్చచేయడం న్యాయమైనటువంటి విషయంకాదు.

మిస్టర్ స్పీకర్: ఇదివరలో శ్రీ సుందరయ్య గారు బిల్లులోని 'wording' ను గురించి తెలిపిన అభిప్రాయం సరిగానే ఉన్నది.

శ్రీ బి. శంకరయ్య: ఇదివరలో 1956 లోను, 1957 ఏప్రిల్‌లోను ఈ విషయానికి సంబంధించిన బిల్లులను చర్చిస్తున్న సందర్భాలలో శ్రీ కళా వెంకటరావుగారు ఇటువంటి హామీలనే ఇచ్చారు.

శ్రీ కె. వెంకటరావు: ఇనాం గ్రామం ఎక్కడ ఉన్నా దానిని ఎస్టేటు అనే డిఫినిషన్ క్రిందకు తీసుకొని వస్తానని నేను అప్పుడు చెప్పాను. ఇప్పుడూ చెబుతున్నాను. ఏడాదిగా ఈ ప్రభుత్వం ఏమిచేస్తున్నది అని బల్లగుద్ది చెప్పినటువంటి శంకరయ్యగారు, ఈ ఏడాదికాలంలో ఆ చెల్లాయపాలెం జడ్జిమెంటు నాదగ్గరకు పట్టుకొని రాలేక పోయినందుకు కారణం ఏమిటని నేను అడుగుతున్నాను.

శ్రీ బి. శంకరయ్య: చెల్లాయపాలెం గురించి ఇదివరకే చెప్పాము. లచ్చన్నగారు, ఆ గ్రామంలోని రైతులు స్వయంగావచ్చి వెంకటరావుగారికి చెప్పారు.

శ్రీ కె. వెంకటరావు: ఈ శాసనసభలో పూర్తి అధికారంతో నేను మనవి చేస్తున్నాను. ఇది శుద్ధ అబద్ధం. నా దగ్గరకు ఆయన జడ్జిమెంటు తీసుకొనిరాలేదు. తీసుకొని రాలేదు, తీసుకొనిరాలేదు.

శ్రీ బి. శంకరయ్య: ఆ గ్రామంలోని రైతులువచ్చి స్వయంగా చెప్పారు. 800 ఎకరాలు ఒక గ్రామంలో ఉంటే 790 ఎకరాలు ఒక గ్రాంటు ఇచ్చారు. 10 ఎకరాలు ఇంకొక గ్రాంటు ఇచ్చారు. అందువల్ల ఆ గ్రామం ఇనాం ఎస్టేటు కాదన్నారు. ఆ గ్రామం ఇనాం గ్రామమని గవర్నమెంటువారి రిజిష్టరులో ఉన్నది. ఇనాం గ్రామాలని ఉన్నవాటినన్నిటిని రద్దుచేస్తామని చెప్పినప్పటికీ, చెల్లాయపాలెం, పిడుగుపాడువంటి ఎన్నో గ్రామాలను ఎస్టేటులుగా పరిగణించడం జరగలేదు.

(గ్రామముల జాబితా అనుబంధముగా ఇయ్యబడినది).

[*Statement.*

*List of Inam Villages which would become 'Estates' under the Estates Land (Andhra Amendment) Act*, 1956 *in Nellore District.*

| Name of the Inam villages | Name of the taluk | Remarks |
|---|---|---|
| 1 | 2 | 3 |
| Mathakamudi .. | .. Sullurpet | Suit pending in District Magistrate Court, Gudur in respect of proceeding under Act XXX of 1947. |
| Chiruvellakandirga .. | ..Atmakur | Declared by Civil Court as not estates. |
| Thopugunta .. | .. „ | |
| Gurugupad .. | .. Kanigiri | Declared by Civil Court as not estates. |
| Viswanathapuram .. | .. „ | |
| Nimmomahesarapuram | .. „ | |
| Paletipadu Gadepallivari | .. Kandukur | Declared by Civil Court as not estates. |
| Kandriga | „ | |
| Kondapi Gadiyaramvari Kandriga. | „ | |
| Vellatur Kalidasuvari Kandriga .. | „ | |
| Singarayakonda .. | .. „ | |
| Edlurupad .. | .. Kandukur | Declared as not estate by Civil Court. Appeal filed by Government is pending in the High Court. |
| Ven ampeta .. | .. „ | |
| (A) China Kandlagunta Mamidala | „ | |
| vari kandriga. | „ | |
| Chennur .. | .. Kovur | |
| Anantha bhotlavari kandriga | .. „ | Declared as not estate by the High Court. Declared as not estate. |
| Jangalakandriga .. | .. „ | |
| Ulavapalla .. | .. „ | |
| Chellayapalem .. | .. „ | |
| Kalambotla kandriga .. | .. „ | |
| Padugupad .. | .. „ | |
| Pothireddipalem .. | .. „ | Declared by Civil Court as not estates. |
| Gotlapalem .. | .. „ | |
| Velupodu .. | .. „ | |
| Velicherla .. | .. „ | Appeal filed by Govt. is pending in High Court. |
| Kaminenipalem .. | .. | |
| (A) Thiruveedhipad .. | .. | Declared as not estates by Civil Court. Already taken over but Govt. have appealed. |

| Name of the Inam village | Name the taluk | Remarks |
|---|---|---|
| 1 | 2 | 3 |
| Kudithipalli .. | .. Nellore | Suit pending in Addl. District and Sessions Judge Court, Nellore. |
| Mattempad .. | .. „ | Declared by Civil Court as not estate. |
| Kandlapad .. | .. „ | do |
| Kakitalpur .. | .. „ | Appeal filed by Government pending in High Court. |

## APPENDIX II

*List of Post* 1936 *Inam Villages in Nellore District.*

## APPENDIX III

| | | |
|---|---|---|
| Pokkandala .. | .. Rapur | Declared as an Inam estate landholder has filed a writ in the High Court. Hence not taken over. |
| Sreerangarajupuram .. | .. Kovur | Declared as an Inam estate and notified under section 1 (4) of the A.Act 1948. Tribunal remanded the case for retrial. The case is now pending before the A.S.O. Nellore. |
| Gangavaram .. | .. Kovur | High Court quashed the order of the tribunal and ordered for re-enquiry. It is now pending before the Estates Abolition Tribunal, Nellore *i.e.* District Judge. |

SECTION I—*Kandriga.*

| Name of the taluk | Name of Kandriga | Extent | Name of the village to which it is attached | Remarks |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| Gudur .. | Girisatrulavari kandriga | .. 243.0 | Vindur .. | .. |
| | Kandriga .. .. | .. 248.0 | Chennur.. | .. |
| | Boddulapalli Kandriga | .. 618.10 | Odur .. | .. |
| | Guthavari Kathavaripalem Mallavavapuri kandriga | ..2824. 0 | Kadivedu | .. |
| | Garbha kandrigas .. | .. 116. 0 | Budavam | .. There are no villages for these Kandrigas |
| | Garbha kandrigas | .. 446. 0 | Ticcavaram | .. |
| | do | .. 192. 0 | Kapulur.. | .. |
| | do | .. 55. 0 | Rudravaram | .. |
| | do | .. 562. 0 | Gudali .. | .. |
| | do | .. 868. 0 | Kota | .. |
| | Kandriga .. .. | 150. 0 | Eswaravalli | |
| | Boyyavari kandriga | 845- 0 | Yellasri | .. |
| | Basavamma kandriga | .. 112.95 | Vakad .. | |
| Udayagiri .. | Maseed kandirga .. | .. 324.10 | Appasamudram | .. |
| | Chirukulavari kandriga | .. 245.74 | Gundemadakala | .. |
| | Ali Hussain Sahib kandriga | .. 78.20 | Udayagiri | .. |
| | Mangamambapuram kandriga | .. 657.21 | Duttalore | .. |
| | Ayyanapalli Agraharam | .. 162 00 | Nandipad | .. |
| Nellore .. | Rangacharluvari kandriga | .. 102.98 | Bramhadevam | .. |
| | Krishnamacharlu kandriga | .. 70.94 | Pidathapolur | .. |
| | Jangla Kandriga .. | .. 284.20 | | |
| | Machavaram Kandriga | .. 51.24 | | |
| | Duttepad Kandriga .. | .. 187.09 | | |
| | Nalivam kandriga .. | .. 249.27 | | |
| | Battaramvari kandriga | .. 189.74 | Paynampuram | .. |
| | Kuchivari kandirga .. | .. 18.52 | | |
| | Mangalam kandriga .. | .. 111.10 | | |
| | Kuchivari kandriga .. | .. 46.40 | | |
| | Gampalapalem kandriga | .. 216.61 | | |
| | Kurakata kandirga .. | .. 218.08 | Varakampudi | .. |
| | Akkacheruvu kandriga | .. 28.52 | | |
| | Kuchivari kandriga .. | .. 16.14 | | |
| | Ponkalagunta kandriga | .. 11.78 | | |
| | Gurramavari kandriga | .. 91.69 | Krishnapatam | .. |
| | Govindavari kandriga | .. 271.66 | | |
| | Chedulavaram kandriga | .. 189.71 | Vallur .. | .. |
| | Bodusalavari kandriga | .. 386.60 | | |
| | Sangamavari kandriga | .. 161.42 | | |
| | Vadamvari kandriga .. | .. 106.18 | | |
| | Vattaramvari kandriga | .. 52.79 | | |
| | Batturivari kandriga .. | .. 128.64 | | |
| | Anantahcharla kandriga | .. 65.01 | | |
| | Gangulapalli kandriga | .. 145.07 | Epur II | .. |
| | Ramadoss kandriga .. | .. 225.27 | Survepalli | .. |
| | Durbhalamitta kandriga | .. 71.10 | | |
| | Baluvari kandriga .. | .. 396.00 | Amancherla | .. |
| | Apparalavari kandriga | .. 715.00 | | |
| | Koduru kandriga .. | .. 218.09 | Kodur II | |
| | Battaramvari kandriga | .. 57.86 | | |
| | Nukudugunta kandriga | .. 125.45 | | |
| | Ravasamvari kandriga | .. 45.68 | | |

SECTION I—*Kandriga*.

| Name of the taluk | Name of the hamlet | Extent | Name of the village to which it is attached. | Remarks |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| | Vennelagantivari kandriga | .. 5.70 | | |
| | Paturivari kandriga .. | .. 66.84 | | |
| | Nellimitta kandriga .. | .. 92.92 | | |
| | Swamigari kandriga .. | .. 91 75 | Kodur II | |
| | Tellakurthi kandriga .. | .. 65.97 | | |
| | Talapati Dibba kandriga | .. 95.93 | | |
| | Modalari kandriga .. | .. 169.39 | | |
| | Pandoruvu kandriga .. | .. 174.54 | | |
| | Modalavari Inam .. | .. 142 07 | | |
| | Varikondavari kandriga | .. 32 61 | Vavikonda | .. |
| | Rangacharlu kandriga | .. 58.13 | Kodur .. | .. |
| | Kalavandla kandriga .. | .. 410.70 | Gangapatnam | .. |
| | Budurivari kandriga | .. 41.87 | | |
| | Kavecherlavari kandriga | .. 16.02 | | |
| | Palurivari kandriga .. | .. 236.79 | Indukurept II | .. |
| | Pusalavari kandriga .. | .. 281.49 | | |
| | Durbhalavari kandriga | .. 162.41 | Lebur Bit. II | .. |
| | Bellamvari kandriga .. | .. 18.38 | | |
| | Urimindivari kandriga | .. 88.37 | | |
| | Josulavari kandriga .. | .. 121.42 | Somarajupalli | .. |
| | Bhaskavavari kandriga | .. | | |
| | Sundragivivari kandriga | | | |
| | Ananthabotlvari kandriga | 287.00 | Zakkepalli Gudur | .. |
| | Jodagogulavari kandriga | 812.00 | Zuvveladinne | .. |
| | Srirangarajupuram .. | ..12228.00 | Kesavaram | .. |
| | Chintalagarivari kandriga | .. | | |
| | Akkarajuvari kandriga | ..1777.00 | Bogole .. | .. |
| | Kamashitayi kandriga | .. 828.54 | Padalakur | .. |
| | Narasimha kandriga .. | .. 582.88 | Kanuparthy | .. |
| | Nuthakivari kandriga | .. 793.03 | Yehur .. | .. |
| | Acres. | ..21870.78 | | |

SECTION. II

| | | | | |
|---|---|---|---|---|
| Kovur | .. Racherlapad | ..1127.00 | Talamanchi. | |
| Kavali | .. Lingaraju Agraharam | .. | | |
| | Gopannapalem | 2992.00 | Jaladandki | |
| | Darsi Agraharam | 1618.00 | Annavaram | |
| | Bramhanakraka Agraharam | ..4076.00 | Bramhankraka. | |
| | Koppoluvaripalem | .. 58.00 | | |
| | | 9796.00 | | |

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి: ఈ గ్రామాలు వారి నియోజక వర్గంలోనివేనా ?

శ్రీ బి. శంకరయ్య: నా నియోజక వర్గంలోవనికాదు. ఒక్కొక్క తాలూకానుతీసుకొని ఇనాంగ్రామాల, ఖండ్రికల పేర్లు చెబుతున్నాను. ఈ లిస్టు గవర్నమెంటు తయారు చేసినది.

*Mr. Speaker :* Pass it on to me, and I shall pass it to the Revenue Minister.

శ్రీ బసవ మానయ్య: On a point of order, Sir, మనగౌరవనీయులైన మంత్రిగారు సభ్యులు, అంతా "నీవు", "నేను", "మీరు"అనే శబ్దాలు వాడుతూ" వెంకటరావు" అని—ఈ విధంగా మాట్లాడటం జరుగుతున్నది. దయచేసి "గౌరవనీయ మంత్రిగారు" "అధ్యక్షులవారు" అని అంటే బాగుంటుందని ప్రార్థన.

మిస్టర్ స్పీకర్: సరే.

శ్రీ బి. శంకరయ్య: ఇప్పుడు చదివినవన్నీ తాలూకావారీగా సెల్లూరు జిల్లాలో గవర్నమెంటు రిజిష రులో ఉన్నప్రకారం ఇనాం గ్రామాలని పిలువబడు తున్నవి. కొన్ని రైత్వారీ గ్రామాలకు అనుబంధంగావుండే ఇనాం ఖండ్రికలు, ఇనాం శివార్లు కొన్ని, అందువల్ల ఇనాం గ్రామాలని, ప్రభుత్వ రిజిష్టరులో ఉండేవాటినన్నిటిని ఎస్టేట్సుగా చేయాలని ప్రభుత్వ ఉద్దేశమైతే ఇదివరకు కోర్టు ఇచ్చిన తీర్పుప్రకారం ఎస్టేట్సు కాకుండా పోయిన వాటిని ఎస్టేట్లుగా మార్చుటకు చర్యలు తీసుకోరా ?

మిస్టర్ స్పీకర్: గవర్నమెంటు ఉద్దేశం చెప్పారు. "Made, granted or confirmed" తప్ప తక్కిన ఇనాం గ్రామాలకు ఇది (history of legislation from 1908 to 1957) వర్తించదని అన్నారు. మిగిలిన వాటి విషయంలో మీరు చేయించుకోవాలి.

శ్రీ బి. శంకరయ్య: వారు అట్లా చెప్పటంలేదు. ఇనాం గ్రామాలు అన్నింటికీ వర్తిస్తుంది అని చెప్పారు.

మిస్టర్ స్పీకర్: లేదని చెప్పారే.

శ్రీ బి. శంకరయ్య: ఇనాం గ్రామాలని ఈ రోజున గవర్నమెంటు లిస్టులో ఉన్నవి.

మిస్టర్ స్పీకర్: రిజిష్టరు లో ఉంటే పనికిరాదు. "Made, granted or confirmed" అని బుజావయివటువంటి వాటికే......

శ్రీ బి. శంకరయ్య: అందువల్ల గవర్నమెంటు రిజిష్టరులో ఉన్న ఇనాం గ్రామాలు అన్నింటిని ఎస్టేట్సు చేయాలని కోరుతున్నాను. ఇంకొక విషయం గవర్నమెంటు ఈ చట్టంచేసి ఫలాని గ్రామాలు వస్తాయని చెప్పడమేగాని వాటినన్నిటిని ఎస్టేట్సుగాచేసే అధికారం లేదని చెప్పారు. ఫలాని ఫలాని ఎస్టేట్సుని గవర్నమెంటు నోటిఫై

చేస్తుంది. ఆ విధంగా ఇదివరకు నోటిఫై చేశారు. చట్టములో కూడ ప్రొవిజన్ ఉన్నది. ఇదివరకు 1948 జమిందారీ రద్దు చట్టములో కూడ గవర్నమెంటు నోటిఫై చేసినప్పటినుంచి ఫలాని, ఫలాని జమీన్లు రద్దుచేస్తామని చెప్పారు. 1904 లో ఇంపార్టబుల్ ఎస్టేట్సు ల్యాండ్ ఆక్టు చేసినప్పుడు ఫలాని, ఫలాని జమీందార్లు—అని ఒక లిస్టు ఇచ్చారు. అందువల్ల ఇది జమీన్ కాదని ఎవరూ డిస్ప్యూట్ చేయటానికి వీలు లేకపోయింది.

మిస్టర్ స్పీకర్: కాబట్టి గవర్నమెంటుకు అధికారం లేదనేది ఏమీలేదు.

శ్రీ బి. శంకరయ్య: అందుచేత గవర్నమెంటుకు అధికారం ఉన్నది. ఫలాని గ్రామా లన్నిటికి వర్తింపజేస్తున్నాం—అని ఆ గ్రామాల లిస్టు ఇందులో జతచేయాలని కోరుతున్నాం. ఈ లిస్టు జతచేసిన యడల, ఇనాం గ్రామాలలో "మాది ఎస్టేటుకాదు, రైతును తొలగించాలి" అని ఎవరూ కోర్టుకు పోకుండా ఉంటారని మేము సెలెక్టు కమిటీలో చెప్పాము. ఆ విషయం మంత్రిగారి దృష్టికి తీసుకువచ్చాం. ఇవన్నీ 1945 సవరణవల్ల ఇనాములుగా కవర్ అయినట్లు వెంకటరావుగారు సెలవిచ్చారు. 1945 సం॥ లో సవరణ ఈ విధంగాచేశారు—ఒక గ్రామంలో పోరంబోకో, మైనర్ ఇనామో ఉంటే, అది major grant ఇచ్చేముందు, ఇవ్వాలని చెప్పారు. ముందు ఇవ్వవలెనన్నారు కాబట్టి, ముందు ఇచ్చారా, వెనక ఇచ్చారా,—అనే ఋజువు భారం రైతుమీద ఉన్నదన్నారు. 1802 లో ఇనాం కమీషను వీటిని నిర్ణయించినది. అంతకుముందు ఎప్పుడో ఇనాం ఇచ్చినప్పుడు, ఈ 10 ఎకరాలు దానికి ముందే ఇచ్చి ఉన్నాననే రికార్డు రైతులు సంపాదించుకోలేక పోయారు. సంపాదించుకొనే అవకాశం కూడలేదు.

మిస్టర్ స్పీకర్:—35లో కూడా "made, granted or confirmed" అని వున్నది. అందువల్ల దీనిలో క్రొత్తవి రాలేదు.

శ్రీ బి. శంకరయ్య:—అందువల్లనే 1954 లో ప్రకాశం ప్రభుత్వంలో విశ్వనాథంగారు ఆలోచించి "substantial portion of a village" అని పెడితే గ్రామాలలో ఉండే ముఖ్యమైన గ్రాంట్సు అన్నీ, (4 ఎకరాలు, 10 ఎకరాలు—చాకిరి ఇనాములు తప్ప) ఎస్టేట్సు అగుటకు, రైతుల హక్కులు నిలబెట్టుటకు అవకాశం కలుగుతుందని ఆబిల్లు తయారు చేశారు. గవర్నరుగారు దానిని అక్సెప్టు చేశారు. ప్రసిడెంటుగారు చట్టం చేశారు. మళ్ళీ అది సెలక్టు కమిటీకి వచ్చినప్పుడు—substantial portion కాదు, చాకిరి ఇనాములు తప్ప మిగిలిన గ్రాంటులు అన్నీ చేయాలంటే, చిన్న చిన్న గ్రాంట్సు మైనర్ ఇనాములు మినహాయించి మేజరు గ్రాంట్సు అన్నీ చేయాలని సెలక్టు కమిటీ పాస్ చేసింది. దానికి ప్రభుత్వం ఒప్పుకొనలేదు. "Hamlets, kandrigas in an inam village" అని శ్రీ వెంకటరావు గారు సవరణ తీసుకు వచ్చి నందువల్ల ఎటువంటి అన్యాయ పరిస్థితి ఏర్పడిందో యిందాక ఒక ఉదాహరణ చెప్పాను. పడుగుపాడు అనే గ్రామంలో, వెయ్యి ఎకరాలు గ్రాంటు ఇనాంకాదు, ఎస్టేటు కాదు, రైతులను తొలగించ వచ్చునని, 70 ఎకరాలు పత్రంవారికి ఖండ్రిక అని పేరు పెట్టించారు.

కాబట్టి దానికి వర్తించదని చెబితే, వారు చెప్పినటువంటి చట్టం ఎంత వికృతంగా తయారై, రైతులకు ఉపయోగ పడకుండా, రైతులను భూములనుంచి తొలగించ డానికి ఏ విధంగా దారి తీస్తుందో ఆలోచించమని కోరుతున్నాను. అందువల్ల ఇప్పుడు ఫలానా ఎస్టేట్సని వారు define చేసిన చోట ఈ లిస్టునుకూడా చేర్చుటకు కష్ట మేమిటి? ఆంధ్రలోని 11 జిల్లాలలో ఉండే ఇనాం గ్రామాల లిస్టు ఇప్పుడు చేరిస్తే మళ్ళీ కోర్టుకు పోవలసిన అవసరం ఏమి వుంటుంది? వీటికి మళ్ళీ యింకొక చట్టం తీసుకు రావలసిన అవసరం ఏమి వుంటుంది? ఆ గ్రామాల లిస్టు అంతా గవర్నమెంటు దగ్గర ఉన్నది. వాటిని ఇనాం గ్రామాలని వ్యవహరిస్తున్నారు. క్విట్ రెంటు వసూలు చేస్తున్నారు. అటువంటప్పుడు, ఈ గ్రామాల లిస్టుకూడా యిప్పుడు చేర్చటానికి ప్రభుత్వానికి ఏమి నష్టము వుంది? ఇదివరకు ఎస్టేటు ఎబాలిషన్ ఆక్టు 1904 లో జమీన్లకు లిస్టు ఇచ్చారు. మళ్ళీ కోర్టుకు పోకుండా "మా జమీన్‌కు వర్తించదని" "మా వెంకటగిరికి వర్తించదని" చెప్పే అవకాశం లేకుండా ఒక్కసారిగా జమీన్‌లు, గవర్నమెంటు ఏ రోజున నోటిఫై చేస్తే, ఆరోజున తీసుకొనుటకు అవకాశం కలిగింది. కాబట్టి యిప్పుడు కూడా ఈ గ్రామాలకు లిస్టు ఇందులో యిస్తే కోర్టుకు పోయే అవకాశం లేకుండా వుంటుంది. ఇప్పుడు లిస్టు యివ్వనిచో అక్కడి రైతులను భూములనుంచి తొలగించే అవకాశం ఉంటుంది. దున్నే వానికే భూమి యిస్తామని చెపుతున్నప్పుడు అటువంటి లిస్టు ఎందుకు యివ్వకూడదు? ఆ విధంగా చేయదలుచుకుంటే ప్రభుత్వం ఈ రోజుకు వాయిదావేసైనా, రేపు ఆ లిస్టు తెప్పించి యిందులో చేర్చి ఈ చట్టం pass చేయవచ్చును. అంతే గాని అసలు చేయటానికే అవకాశం లేద అని చెప్పటం న్యాయం కాదు. దున్నేవానికి భూములు ఇస్తామని, హక్కులు యిస్తామని చెబుతూ దున్నే వారిని భూములనుంచి తొలగించే అవకాశం ఇవ్వటం న్యాయంకాదు. వారు 60 లక్షలమంది అని చెప్పారు; 60 లక్షలు కాకుంటే 20 లక్షలు కావచ్చు. 30 లక్షలు కావచ్చు. వారందరికీ ఈ చట్టం వల్ల ఏం లాభం కలగకపోతే, భూమి లేకుండా వారంతా ఏమి చేయాలని ప్రభుత్వం కోరుతున్నది? ఇప్పుడు భూములు వదులుకు పొమ్మంటే కొన్ని తరాలనుంచి అనుభ విస్తున్న రైతులు, భూములు వదులుకొని పోవుటకు సిద్ధ పడతారా? వాళ్ళను తొలగించరాదని 56లో చట్టము పెట్టారు. ఇంతవరకు ఆ విధముగా నోటీసులు ఇస్తున్నారు, తొలగించటానికి పూనుకుంటున్నారు. కోర్టులకు ఎక్కుతున్నారు. 1956 లో ప్రభుత్వం హామీ యిచ్చింది ఇప్పుడుకూడా హామీ ఇచ్చేటట్లుగా సవరణ చేస్తే బాగుంటుందని కోరుతున్నాను.

శ్రీ పి. సుందరయ్య :—అధ్యక్షా, ప్రొసీజరును గురించి మిమ్మలను అడుగుతాను. ఇందాక శంకరయ్యగారు లిస్టు చదివారు. కొన్ని చదువుతూవుంటే మీకిచ్చారు. అది మంత్రి గారికి యివ్వటం కాదు. మంత్రిగారికి మామూలుగా correspondence చేసి యివ్వవచ్చు. ఈ అసెంబ్లీ వేదిక నుంచి అటువంటి గ్రామాలు ఉన్నవని చెప్పినట్లు రికార్డు అవాలి.

***Mr. Speaker :*** **I shall place it on the Table of the House.**

శ్రీ పి. సుందరయ్య :—ప్రొసీడింగ్సులో రికార్డు కావలసి ఉంటుంది.

మిస్టర్ స్పీకర్ :—మంత్రిగారు వచ్చిన తరువాత సెటిల్ చేద్దాము. వారిది కూడా విని చెప్తాను.

*శ్రీ బసవ మానయ్య :—అధ్యక్షా, ఆంధ్రలో వుండబడే ఎస్టేట్లు, ఈనాములు, ఖండ్రికలు hamlets మేలువరం, కుడివరం—అనే శబ్దాలు తెలంగాణాలో ఉండే వారికి చాలా కొత్త. ఇక్కడ వుండే శబ్దాలు—జాగీర్లు, మక్తాలు, పాయిగాలు, ఖాల్సాలు,—యివి ఆంధ్రలో ఉన్నవారికి చాలా కొత్త శబ్దాలుగా వుంటవి. పేర్లు ఏవి అయినా తత్వాలు, విధానాలు, ఒకటే అలవాటుగా వుండి వుంటాయి. తెలంగాణాకు సంబంధించిన విషయాలు కొన్ని చెప్పాలని అనుకున్నాను. పూజ్య కళా వెంకటరావు గారు ఇక్కడ వుంటే బాగుండేది.

శ్రీ డి. సంజీవయ్య :—"గౌ. సభ్యులు యింతకు ముందు చెప్పినట్లుగా 'వెంకటరావుగారు." అని అనకుండా "రెవిన్యూశాఖామాత్యులు ఇక్కడ వుంటే బాగుండేది" అని అంటే బాగుంటుంది.

మిస్టర్ స్పీకర్ :—"పూజ్య వెంకటరావుగారు" అని అన్నారు గనుక ఫరవాలేదు.

శ్రీ బసవ మానయ్య :—ఇంతకు ముందు హైదరాబాదు ప్రభుత్వము టెనెన్సీ ఆక్టు ఒకటి పాస్ చేశారు. శ్రీ బి. రామకృష్ణారావుగారు చీఫ్ మినిష్టరుగా వున్నప్పుడు, యిక్కడ పూర్వం ఉండే, జాగీర్లు, ఖాల్సాలు—యివన్నీ తీసివేయబడ్డాయి.

హైదరాబాదు టెనన్సీయాక్టు చాలా ప్రోగ్రెసివ్‌గా ఉన్నదని, ఇక్కడివారేగాక ఇతర రాష్ట్రాల వారు కూడా పొగుడుతూ ఉంటారు. జాగీర్లు, ఖాల్సాలు, పాయగా—ఇవన్నీ తీసివేయబడ్డవి. "ఇంజమామీ జాగిరాత్" అని ఒక చట్టాన్ని తీసుకువచ్చారు. సేరీలు, ఇనాములు మొదలైనవి ఇంకా యీ తెలంగాణాలో ఉండిపోయినవి. 1955 లో "ఇంజమామీ ఇనామ్" అని ఇనామ్ ఎబాలిషన్ అని ఒక చట్టాన్ని తీసుకువచ్చారు. కాని కొన్ని circulars ద్వారా ఆ చట్టము ఆపడినది. ఈ ఎస్టేట్ల విషయంలో ఆంధ్రప్రాంతంలో ఇనాములని ఖండ్రికలని, hamlet అని అంటూంటారు. వీటిగురించి గంటనుండి చర్చ జరుగుతున్నది ఇదే సమయంలో, తెలంగాణాలో మిగిలి ఉన్న సేరీలు మక్తాలనుకూడా సమన్వయం చేసిఉంటే బాగుండేది. 1908 వ సంవత్సరంనుండి యీనాటివరకు, మొత్తం 50 సంవత్సరాలుగా ఎస్టేట్ల గురించి ఆలోచిస్తూ చట్టాలు చేస్తూ ఉండటం మనం చూస్తున్నాము. ఇవాళ్ళ యీ స్వరూపంలో మనముందుకు యీ బిల్లు తీసుకురాబడ్డది. ఇందులో సూచించిన ఖండ్రికలు, ఇనాముల పేర్లతోనేగాక ఇంకా అనేకమైన ఇతరపేర్లతో ఇనాము ఎస్టేట్లు ఉన్నవి. ఇనాందార్లు ఇంకా లాభాలు పొందుతూనే ఉన్నారు. ఆ భూములనుండి రైతులను తీసివేయటానికి ప్రయత్నాలు చేస్తున్నారు. దీనిని ప్రభుత్వం వెంటనే అరికట్టవలసి ఉన్నది. తెలంగాణాలో దొరలు యీ తేదీవరకు కూడ సేరీలను కౌలుకు తీసుకొంటున్నారు. ఇటువంటి సేరీలన్నింటినికూడ ఇందులో చేర్చి, వీటన్నింటిని సమన్వయంచేసి తీసుకువచ్చినట్లయితే తెలంగాణా రైతు ప్రముఖ్యకూడా చాలావరకు పూర్తిఅయ్యేది. మా నియోజకవర్గంలో.........

మిస్టర్ స్పీకర్: ఆ ఇంటిగ్రేషన్ యిప్పుడు లేదు. కనుక దానిని గురించి ఇప్పుడు వీరు వివరిస్తే లాభం లేదు. It is all irrelevant ఇది పాత ఆంధ్ర ఏరియాలోని ఇనాములకు సంబంధించిన బిల్లు. ఇంటిగ్రేషన్ క్వశ్చన్ ఇందులో లేదు. కాబట్టి వీరు ఇంటిగ్రేషన్ గురించి చెప్పకుండా ఆంధ్ర ప్రాంతంలోని ఇనాములను గురించి చెప్పండి. తక్కినదంతా ఇర్రెలెవెంట్ కనుక వద్దని చెబుతున్నాను.

శ్రీ బసవ పూనయ్య: ప్రభుత్వం చేసు చెబుతున్నది ఒక పాలసీగా గ్రహించి ఇక్కడ కూడా, (తెలంగాణాలో) కష్టాలు ఉన్నాయని గ్రహించి వాటిని పోగొట్టటానికి తొందరగా బిల్లు తేవాలని, ఇంటిగ్రేషన్ తొందరగా చేయాలని కోరుతున్నాను. ఆంధ్రలో ఉన్న పరిస్థితులే తెలంగాణాలో కూడా ఉన్నాయని ప్రభుత్వం గ్రహించాలి. పేద రైతులు ముఖ్యంగా వారాలలో, కేసులలో చాలా నష్టపడుతున్నారు. రాంపురం, రెడ్డిపల్లి, కొయిదంపల్లి మొదలైన గ్రామాలలో 15 వందల ఎకరాల భూమిని, అక్కడి దొరగారికి సేరి అయిన దానిని, రైతులు వంశపారంపర్యంగా సాగు చేసుకొంటున్నారు. అటువంటి భూమిని ఆయన అమ్మటానికి ప్రయత్నం చేస్తున్నాడు. అవి దస్తగర్జా అయినవి. దస్తగర్జా అంటే, శేరీ హక్కు అతనికి ఉండదు. ఏదో కొంతపన్ను అతడు ప్రభుత్వానికి చెల్లిస్తాడు. ఆతడు భూమి అమ్మదలచి, రైతులను వెళ్ళకొడుతున్నాడని, ఆ భూమిని రైతులకు కౌలుకు ఇవ్వటంలేదని రైతులు తహశీల్‌లోనూ, కలెక్టర్ ఆఫీసులోనూ తెలియజేసినప్పటికి లాభం లేకుండా ఉంది. ఈ దస్తకర్జా విషయంలో, వారు రిప్రజెంట్ చేయటానికి ఇక్కడకు వచ్చి, ఇక్కడ పనిచేస్తున్నటువంటి అధికార్లకు తెలియజెప్పినా, ఇక్కడి వారికి దస్తకర్జా అనే శబ్దం తెలియదు. శేరీ యొక్క యజమానులకు............

శ్రీ డి. సంజీవయ్య: అధ్యక్షులు ఇర్రెలెవెంట్ అని చెప్పినప్పటికీ, సభ్యులు తెలంగాణాలోని శేరీలను గురించి చెబుతున్నారు.

మిస్టర్ స్పీకర్: తెలంగాణాయొక్క పరిస్థితులుగురించి, వాటి తప్పొళ్ళు గురించి సభ్యులు చెప్పనక్కరలేదు. తెలంగాణాలో కూడా కష్టాలు ఉన్నాయి అని చెప్పండి; చాలు. ముందే తెలంగాణాలో ఒక చట్టము ఉన్నది. ఈ చట్టాలను ఇంటిగ్రేట్ చేయాలి. ఇదే తర్వాత జరుగుతుంది. ముందు యీ ఆంధ్రఏరియాకు సంబంధించిన బిల్లు కానివ్వండి. తెలంగాణాలో ఇదివరకు ఒక చట్టం చేసుకొన్నారు. అవీ, ఇవీ కలిపి చేసుకోవాలి. అదంతా పెద్ద ప్రశ్న.

శ్రీ బసవ పూనయ్య: తెలంగాణాలో ఉన్న విషయాలను ప్రభుత్వం తొందరగా గ్రహించి, సమన్వయించేసే సమస్య ఇప్పుడు మనముందు లేకపోయినా, వెంటనే బిల్లు తేవలసిన కారణములు చెబుతున్నాను.

మిస్టర్ స్పీకర్: ఇప్పుడు వీరు కారణములు చెప్పవలసిన అవసరం లేదు. మీరు చెప్పిన దాంతో అందరము ఏకీభవిస్తున్నాము. వీలైనంత త్వరలో ఇంటిగ్రేషన్ కావాలి లేకపోతే చిక్కులు ఉన్నాయి. తెలంగాణాలో కూడ రైతులు బాధలు పడుతున్నారు. వీటిని

అందరం అంగీకరిస్తున్నాము. కాబట్టి, ఆంధ్ర ప్రాంతంలోని ఇనాముల గురించి మీకేమైనా అభిప్రాయాలుంటే చెప్పండి.

శ్రీ ఒరవ మానయ్యా : పూజనీయ అధ్యక్షా, "తెలంగాణాలోని ఇనాములు, శేరీలు మక్తాలు రద్దు చేయాలనే ప్రభుత్వ ఉద్దేశము అని, అందుకు తొందరలోనే చర్యలు తీసుకొంటారు అని" హామీ ఇస్తున్నారు కనుక నేను విరమించుకొంటున్నాను.

*శ్రీ ఇ. అయ్యపురెడ్డి (నందికొట్కూరు—జనరల్) : అధ్యక్షా, ఈ బిల్లుపైన మంత్రిగారు వివరించిన వివరాలు విన్న తర్వాత, కొన్ని కొత్త సందేహాలు ఉత్పన్నం అయినవి. ఆ సందేహాలు నివృత్తి చేసుకోవటంకోసం ఇప్పుడు నేను మాట్లాడవలసి వచ్చింది. 1948 లో ఎస్టేట్సు ఎబాలిషన్ యాక్టు పాస్‌చేసిన తర్వాత, ఆ యాక్టు క్రింద బేచెన్, బేచెన్‌గా ప్రభుత్వం జమీందారీ ఎస్టేటులని, ఇనాము ఎస్టేటులని కొన్ని గ్రామాలను తీసుకొంటూవచ్చింది. జి. ఒ. నంబరు 2302, రెవిన్యూ డిపార్టుమెంటు, తేదీ 1-9-51 లో 'టేకెన్ ఓవర్‌సర్టెన్ ఇనామ్ ఎస్టేట్స్' అనిచెబుతూ నెం. 280 లో ప్రభుత్వం ఇలా నోటిఫికేషన్ ఇచ్చింది.

"In exercise of the powers conferred by Section 1 (4) of the Madras Estates (Abolition and Conversion into Ryotwari) Act, 1948 (Madras Act XXVI of 1948), His Excellency the Governor of Madras hereby appoints the 1st day of October 1951 as the day on which the provisions of the said Act other than Sections 1, 2, 4; 5, 7, 8, 9, 62, 67 and 68 which have already come into force, shall come into force in the Inam Estates specified in the Schedule below."

షెడ్యూల్‌లో చూపించినవి ఇనాము ఎస్టేటులని వారే చెప్పారు. శ్రీకాకుళం జిల్లాలో 103, విశాఖపట్నం జిల్లాలో 26, తూర్పుగోదావరిజిల్లాలో 10, వెస్టుగోదావరి జిల్లాలో 60, కృష్ణా జిల్లాలో 51, గుంటూరుజిల్లాలో 30, బళ్ళారినుండివచ్చిన ఆదోని ఆలూరు తాలూకాలలో 23, అనంతపురం జిల్లాలో 79, చిత్తూరు జిల్లాలో 191 కడపజిల్లాలో 125, కర్నూలు జిల్లాలో 54, నెల్లూర్ జిల్లాలో 167, మొరసి ఆంధ్ర ప్రదేశ్‌లో 909 గ్రామాలు ఇనాము ఎస్టేటులని, వీటికి యీ చట్టం అనువర్తిస్తుందని 1-9-51 న డిక్లేర్ చేశారు. తరువాత ఆ ఇనామ్సు ఎస్టేట్సుకావని సెటిల్‌మెంట్ ఆఫీసరుగారు తీర్పు ఇచ్చారు. సెటిల్‌మెంట్ ఆఫీసర్ గారు ఇనామ్ ఎస్టేటులని చెప్పినవాటిని ట్రిబ్యునల్, కాదని అన్నారు. అది అలా వివాద గ్రస్తంగా ఉంటూఉండగా, యీ ఎస్టేట్సు డెఫినిషన్‌ను ఎన్‌లార్జ్ చేయాలని మనం ఖండ్రికలు hamlets కూడా చేర్చాము.

అటుతరువాత ఇక మిగిలిన ఇనాములన్నీ ఈ బిల్లు ద్వారా రద్దుచేసి, ఇకమీదట ఈ ఇనాము సమస్య ఏవిధముగాను లేకుండ చేయాలనే ఉద్దేశ్యముతో ఈ బిల్లును తీసుకుని రావడము అయింది. కాని ఇంకను Estates కానటువంటి గ్రామాలు కొన్ని ఉన్నవి. Inam

Estates అని ఒక జి.ఒ. ద్వారా పరిగణింప జేసినప్పటికినీ, అది Settlement Officer అయితేనేమి, Tribunal అయితేనేమి, ఎవరైనను ఫలానా గ్రామాలు Estate క్రిందకురావు అని చెప్పిన గ్రామాలు కూడ కొన్ని ఉన్నవి. మా కర్నూలు జిల్లాలోనాకు తెలిసినంతవరకు కొన్ని ఉదహారణలు అటాంటివి చెబుతున్నాను. ఆదోని తాలూకాలోని మంచాల, మరొక తాలూకాలోని కరిపెన గ్రామములు Estates క్రిందకురావు అని నిర్ణయించారు. ఇవి Estates కావు అని చెప్పగానే, పోయినసారి ఆంధ్ర ఎసెంబ్లీలో ప్యాసుచేసిన Minor Inams Abolition Act క్రింద ఇవి అన్నీ minor inams క్రిందకు వస్తాయి గనుక మాకు $\frac{2}{3}$ వంతున వచ్చేభూమికి పట్టాలు ఇవ్వవలసి ఉంటుందని అక్కడ రైతులు అందరు దరఖాస్తులు పెట్టియున్నారు. ఇప్పుడు ఆ యాక్టు క్రింద కొంతవరకు ఆయా గ్రామాలలో దర్యాప్తులు సాగుతున్నవి. ఇప్పుడు గౌ॥ సభ్యులు శంకరయ్యగారు చేసిన వాదములోను, వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఒడీ ఏకారణముచేత నైతనేమి ఒకసారి ప్రభుత్వము తన నోటిఫికేషను ద్వారా ఫలానా గ్రామాలు Estates అని ప్రకటించిన తరువాత, మరల Tribunal గాని, Settlement Officer గాని అవి Estates కావు అని చెప్పినంత మాత్రాన అవి చెల్లకుండ పోయినాయి గనుక వాటికి ఈ యాక్టు వర్తించేటట్లుగాచేసి అవి కూడ Estates క్రింద convert చేసి రైతులకు నష్టపరిహారము ఇవ్వవలెనని వారు వాదిస్తున్నారు. కాని అవి minor inam estates క్రిందకు వస్తాయి, వాటిని మేము ఇకమీదట Estates క్రిందకు చేర్చము అని నిర్దుష్టముగ నిర్ధారణ చేసినట్లు చెప్పినట్లైతే, అంతటితో ఆ సమస్య తీరిపోయి ఉండేదేమోనని అనుకుంటాను. అలాకాకుండ వాటిని మరల Estate క్రిందకు తీసుకుని రావటానికి ప్రయత్నిస్తాము అని చెప్పడములో, నాకు కొన్ని సందేహాములు కలుగుతున్నవి. ఎందువల్లనంటే, శంకరయ్యగారు చెప్పిన గ్రామము విషయములో ఇచ్చిన Judgment చూచి అవి Estates క్రిందకు రావటానికి వీలు అయితే దానికి ఒక amendment తీసుకుని వస్తానని మంత్రిగారు అంటున్నారు. ఆ విధముగ తీసుకుని వచ్చేటట్లయితే, మంచాల గ్రామం, కరిపెన గ్రామం కూడా Estates గా పరిగణించటానికి ఒక amendment మంత్రిగారు తీసుకుని రావలసిందిగా నేను కోరవలసి ఉంటుంది ఇకముందు భవిష్యత్తులో ఏవైనాసరె ఇలాంటి ఇనాం గ్రామాలు.........(Interruption).

*శ్రీ కె. వెంకటరావు : గౌ॥ సభ్యుడు చెప్పింది correct కాదు. నేను చెప్పింది అదికాదు. నేను చెప్పింది ఏమిటంటే, నేను చెప్పిన general principle కింద ఏదైనా పొరబాటువుండి, దానివల్ల Estate క్రిందకురాకుండ escape అయిన గ్రామాలువుంటే, వాటికి మరల amendment తీసుకుని వస్తానని అన్నానుగాని, ఇక ప్రతియొక్క individual case లో గూడ amendments తీసుకురావలెనంటే అది అసంభవమైన విషయము. ప్రభుత్వానికి అటాంటి దృష్టిలేదు. గౌరవ సభ్యులు అయ్యపురెడ్డిగారు చెప్పిన భావమునే నేను కూడ అంగీకరిస్తాను.

శ్రీ ఎ. అయ్యపురెడ్డి: General principle అయినప్పటికిని 1st September 1951, లో ఇవి అన్నీ Inam Estates అని ప్రభుత్వమువారే అన్నారు. అంటే వీటికి general principles apply అవుతాయి అనే ఉద్దేశ్యముతోనే ఇవి Inam Estates అని అన్నారు గనుక వాటిని కూడ Estates Land Act క్రింద పరిగణించ వలెనని అంటే, వాటిని గూడ Estates Abolition క్రింద తీసుకుని రావాలనే ఉద్దేశ్యము ఉంటే, ఇప్పుడే ఆ 919 గ్రామాలు కూడ Estates అని చెప్పివేయండి. అప్పుడు ఇనాందార్లకు, ఇనాంరైతులకు ప్రతిఘటించే తగాదాలు ఉండవు. వారిలో పరస్పరంగా ద్వేషాలు రెచ్చగొట్టి కాని కోర్టుల చుట్టూ తిరుగుతూ, కష్ట నష్టాలకు గురికాకుండ, వారిని ఆబాధనుంచి విముక్తి చేసినవాళ్లు అవుతారు. కాని ఇకమీదట గూడ ఈ general principle ప్రకారము ఇంకా తీసుకుని వస్తామని అంటే, ఈ సమస్యను ప్రభుత్వము తేల్చకుండ ఇంకను దీనిని వాయిదా వేస్తున్నట్లు అవుతుందని విన్నవిస్తూ నేను సెలవు తీసుకుంటున్నాను.

*శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు: అధ్యక్షా, ఎప్పుడైతే మనము Estates Land Act, 1908, యొక్క Section 3 (ii) (*d*) ని ప్రత్యేకంగా సవరించామో అప్పుడు ఈ సవరణ మరల Abolition Act క్రిందకు రావలసి ఉంటుంది గనుక ఆ సవరణకు ఇది consequential amendment అవుతుంది. కాబట్టి దానికి విశేషముగ ఆక్షేపణ ఉండవలసిన అవసరములేదని నా అభిప్రాయము. అయితే ఒక్క విషయము మాత్రము మంత్రిగారు clarify చేయాలని కోరుతున్నాను. ఎప్పుడైతే Section 3 (ii) (*d*) సవరణ అయి, Inam Estate అనేది కూడ సవరణ అయినదో, ఈ ఖండ్రిగలు, శివార్లు అన్నీ కూడ Inam Estates క్రిందకు వస్తున్నవి ఏవి అయితే Inam Estates అవుతాయో వాటికి compensation జాస్తిగ ఇవ్వవలసి ఉంటుంది. ఇప్పుడు అసలు Abolition Act యొక్క అభిప్రాయము ఏమిటంటే, 1802 వ సం॥ కు ముందున్న ఈనాములు అన్నీ ఆ regulation ప్రకారము Estates లో నుంచి మినహాయించబడి, వాటికి ప్రభుత్వమువారు ప్రత్యేకమైన పట్టాలు ఇచ్చినందువల్ల అవి అన్నీ Inam Estates అయినవి. తరువాత 1860 సం॥ లో వచ్చిన Inam Commission లో కొన్నింటికి పట్టాలు ఇవ్వబడినవి. కాబట్టి ఈ ఇనాము పట్టాలు 1802 వ సం॥ కు ముందు ఉన్న Inams కు ఇచ్చి ఉండవచ్చు. 1802వ సం॥ తరువాత ఇచ్చిన ఇనాములకు గూడ పట్టాలు ఇచ్చి ఉండవచ్చు. అవి అన్నీ Inam Estates యొక్క definition క్రిందకు వస్తున్నవి. అయితే Abolition Act యొక్క అభిప్రాయము, నాకు తెలిసినంతమట్టుకు చూస్తే ఏవి అయితే 1802 వ సం. కు ముందు Inam Estates అయినవో వాటికే సంపూర్ణ పరిహారము ఇవ్వవలెనని, ఆటు తరువాత ఇచ్చిన Inams కు పట్టాలు ఇచ్చినప్పటికిని అవి Post-Settlement Inams క్రిందకు వస్తాయి గనుక, వాటికి సంపూర్ణ పరిహారము ఇవ్వనవసరము లేదని నా అభిప్రాయము. దీనికి కారణము ఏమిటంటే

Abolition Act క్రింద under tenures అనేది ఒక Section ఉన్నది. ఆ సెక్షను క్రింద under tenures ఉన్నప్పటికినీ, ఏవి అయితే 1802 సం. కు ముందు ఇవ్వబడినవో వాటికి మాత్రము సంపూర్ణ పరిహారముగాని, 1802 తరువాత వచ్చిన under tenures కు సంపూర్ణ పరిహారము ఇవ్వనవసరములేదని అన్నారు. కాని Abolition Act యొక్క అభిప్రాయములో Inam Estates అన్నీ కూడ 1802 సం॥ కు ముందు ఏవి అయితే ఇవ్వబడినవో వాటికే సంపూర్ణ పరిహారము ఇవ్వవలసి ఉంటుంది. 1802 సం. కు తరువాత ఇవ్వబడిన వాటికి. అవి Inam Estates అయినప్పటికినీ సంపూర్ణ పరిహారము ఇవ్వవలసిన అవసరములేదు అనే అభిప్రాయము ఉండవచ్చు. అయితే మనముచేసే ఈ తీర్మానమువల్ల Inam Estates అనేవి Section 3 (*ii*) (*d*) లో "1802 వ సం. కు ముందు అనిగాని, వెనుక అనిగాని" నిర్ణయించ లేదు. "made, confirmed or recognised" అనేది ముందు ఉండ వచ్చును, లేకపోతే వెనుక ఉండవచ్చును. అలాంటప్పుడు ప్రభుత్వమువారి అభిప్రాయము Post-Settlement Inam Estates కు కూడ సంపూర్ణ పరిహారము ఇవ్వాలనే అభిప్రాయమా? అదే అభిప్రాయము అయితే under tenures కు ఒక విధముగాను, inam tenures కు ఇంకొక విధముగాను, పరిహారము ఇవ్వ టానికి ఏమి కారణము? ఈ విషయము మంత్రిగారు వివరించవలెనని కోరుతున్నాను.

*Mr. Speaker:* Under tenures are more or less service tenures. అలాంటివి ఎన్ని ఉన్నవి?

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు: కాదండి. Under tenures separate గా పెట్టటానికి కారణము ఏమిటంటే,—కార్వేటినగరం, కాళహస్తి, వెంకటగిరి ఈ మూడు Estates లో మాత్రము పూర్వము ఇచ్చిన Inams అన్నీ కూడ, అంటే Pre-Settlement Inams అన్నీ కూడ మినహాయించకుండ Estates, లోనే "part of the Estate" గా ఇచ్చారు. అవి Privy Council వరకు పోయినప్పుడు ప్రభుత్వము, "ఇవి మావి" అని వాదిస్తే, జమీందార్లు "ఇవి మీవికావు, మావే" అని వాదిస్తే, అవి Pre-Settlement అయినప్పటికినీ, 1802 వ సం. లో జరిగిన settlement లో మినహాయించ బడలేదు గనుక, ఇటువంటి ఇనాములు అన్నీ కూడ జమీందార్లకు సంబంధించినవేగాని, వాటితో ప్రభుత్వానికి సంబంధము లేదు గనుక వాటికి ప్రభుత్వము ప్రత్యేకంగా పట్టాలు ఇవ్వకూడదు అని Privy Council వారు తీర్పు ఇచ్చారు.

మిస్టర్ స్పీకర్: అయితే ఈ మూడున్నూ special cases అనుకుంటాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు:—అందువల్లనే అవి under tenures అని పెట్టవలసి వచ్చింది. అప్పుడు మేము "Settlement కు ముందు వున్న ఇనాం

ఎస్టేట్లకు మాత్రం సంపూర్ణ పరిహారముఎందువల్ల ఇవ్వాలి? ఈ మూడు ఎస్టేట్లలో ఉన్న ఇనాములు పూర్వపు ఇనాములుగ ఉన్నప్పటికినీ, వీటినిమాత్రం మినహాయించటానికి కారణము ఏమిటి? Inam Estates under tenures ఒకటే, అప్పుడు అవి Inamdars స్వాధీనము లోనే ఉన్నవి. ఇప్పుడు కూడ under tenures అనేవి Inamdars స్వాధీనములోనే వున్నవి. వాటిలోని తత్వములో ఏమాత్రము తేడా లేదు గనుక, యీ భేదము చేయకూడదు" అని వాదించిన తరువాతనే వీటిని under tenures క్రింద పెట్టారు. ఈ under tenures Pre-Settlement under tenures అని అన్నారు. అదీ న్యాయమే. ఏవి అయితే Pre-Settlement గావున్నవో అవి Inam Estates అయినా సరే under tenures అయినాసరే ఈరెండింటినీ ఒకే విధముగ treat చేయాలని అన్నారు. under tenures Post-Settlement వి అయితే వాటికి Zamin Estates ప్రకారముగా యివ్వవలసిందని అన్నారు. ఇప్పుడు మనం చేసే తీర్మానములో Inam Estates అనే దానికి పూర్వాపరాలు లేవు గనుక వాటికి దరిమిలా ఉన్నప్పటికినీ గూడ సంపూర్ణము గా compensation రావచ్చు. అదే ప్రభుత్వము యొక్క అభిప్రాయమా? లేకపోతే ఏదైనా భేదము చూపిస్తారా? Under tenures కు ఒక విధముగను, Inam Estates కు ఇంకొక విధముగను ఎందుకు చేస్తున్నారు అనే విషయమును clarify చేయవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—అధ్యక్షా, ఈ సవరణ బిల్లును మనము చాలా రోజులుగా కోరుతూ వున్నాము. ఇదీ ఇప్పుడు వచ్చింది. ఇందాక అయ్యపు రెడ్డిగారు మాట్లాడుతూ నా సవరణ అంగీకరించి నట్లయితే చాలా ప్రమాదము వస్తుందని అన్నారు. బహుశః శంకరయ్యగారి సూచనకున్నూ, నా సూచన కున్నూ ఉన్న తేడా వారు గ్రహించినట్లు లేదేమోనని అనుకుంటున్నాను.

శ్రీ ఇ. అయ్యపురెడ్డి:—అట్లాకాదు. గోపాలకృష్ణయ్యగారి సవరణ అంగీకరించినట్లయితే ప్రమాదాలు పోతాయనే అన్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—అట్లాగా! అట్లా అయితే సరే. సంతోషము. ఇదివరకు ఉన్నవి సాధారణముగ అగ్రహారములు అంటారు. ఈ ఇనాములు రెండు రకాలు minor inams అని major inams అని. మా జిల్లాలో వాడుకలో minor inams ను ఇనాములన్ని major inams ను అగ్రహారములని అంటారు.

అగ్రహారములతో ఇనాములు భాగముగ వుండి whole inam village గా లేకుండ వుంటే, వాటిని ఖండ్రిగలు అంటారు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు :—ఈ బిల్లు మీదచర్చ ఎప్పటికి పూర్తి అయి మంత్రిగారు సమాధానము చెబుతారు ?

మిస్టర్ స్పీకర్ :—ఈ దినము బహుశః ఒంటిగంట కు ఓటుస్తాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు :—అంటే ఈ దినము పూర్తి చేస్తారా ?

మిస్టర్ స్పీకర్ :—చూస్తాను. Amendments అన్నింటిమీద చర్చ పూర్తి కాకపోతే, బహుశః రేపటిదాకా వుంటుందని అనుకుంటాను. వీలుగా వుంటే యీ దినమే పూర్తి చేస్తాము.

శ్రీ కె. వెంకటరావు:—Bill కు consideration stage అయిపోతే amendments ఎక్కువసేపు పట్టవు. ఇప్పుడు యీ discussion లోనే amendments అన్నీ అయి పోతున్నవి. వాటిని గురించి మరల సమాధానములు ఒక్కొక్కదానికి చెప్పాలంటే యింకా వుండిపోయి టైము కావలసి వుంటుందేమో కాని discussionలోనే అంతా పూర్తి అయిపోయే టట్లు అయితే అయిపోతాయి. అట్లా ఈ discussion లోనే అయిపోతే, యిక వాటియొక్క quality గురించి యిప్పుడే చెబుతాను.

మిస్టర్ స్పీకర్ :—వారి amendments గురించి వారు చెప్పారు. మంత్రి గారు ఒక చిన్న amendment యిచ్చారు. వారు దానికి చెబుతారు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు :—అయితే ఒక గంట అయినా టైము వుంటుందా ? ఈలోగా బైటకు పోయిరావచ్చునా ? ఈలోపల వచ్చే ప్రమాదము ఏమీ వుండదు గదా !

మిస్టర్ స్పీకర్ :—ఏమీలేదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అధ్యక్షా, వారు బయటికి వెళ్ళడానికి అనుమతి కోసమని నా ఉపన్యాసం interrupt చేశారు.

మిస్టర్ స్పీకర్ : ఫరవాలేదు. శ్రీ శంకరయ్యగారి ఉపన్యాసంలో మీ points అన్నీ వచ్చాయనుకుంటాను. ప్రతి పక్ష నాయకులు తప్ప తక్కినవారంతా పది నిముషాలు తీసుకోవచ్చు.

శ్రీ పి. సుందరయ్య : అధ్యక్షా, శ్రీ శంకరయ్యగారు తమ points అన్నీ చెప్పడానికి గంట తీసుకోవచ్చు. ఇతర సభ్యులకు కూడా points వున్నప్పుడు అవి repeat కాకుండా చూడ్డం మాత్రమేగాని, పది నిమిషాలలో points అన్నీ చెప్పడం సాధ్యంకాదు. ముఖ్యమైన బిల్లులమీద అవకాశం యివ్వవలసి వుంటుంది. అందుచేత పది నిమిషాలను పొడిగించండి.

మిస్టర్ స్పీకర్ : Technical questions మీద అట్లా యిస్తాముగాని వీలైనంత వరకు points గా చెప్పండి.

శ్రీ వావిలాలగోపాల కృష్ణయ్య: నా అభిప్రాయాలన్నీ శ్రీ శంకరయ్యగారు చెప్పారంటే శ్రీ శంకరయ్యగారి అభిప్రాయాలతో నేను ఏకీభవించానుగాని వారు నా అభిప్రాయాలన్నీ చెప్పినట్లు కాదుకదా? ఈ బిల్లు ప్రధానంగా ఒకటే మూల సూత్రానికి సంబంధించినది. 1936 వ సంవత్సరంలో బొబ్బిలి రాజాగారు చేసినటువంటి యాక్టు క్రింద అన్వయించే గ్రామాలు యేవైతే వున్నాయో అవన్నీ కూడా దీంట్లో మినహాయింపు కావాలనే ఉద్దేశ్యంతో వాటిని దీంట్లో చేర్చారు. దానిని ఆ రోజు పూర్తిగా వ్యతిరేకించడం జరిగింది. దీనికి వెనుక కారణం కూడా లేక పోలేదు. శ్రీ ప్రకాశం పంతులుగారు ఎస్టేటు లాండు ఆక్టు మీద రిపోర్టు తయారు చేసినప్పుడు ఆ రిపోర్టులో కూడా దీనిని మినహాయించారు.

మిస్టర్ స్పీకర్: వారి రిపోర్టులో అన్ని ఇనాములు మినహాయించి ఊరుకున్నారు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య: అన్ని ఇనాములు మినహాయించారు. ముఖ్య ఉద్దేశ్యంలో మాత్రం యీ యాక్టును జ్ఞాపకం ఉంచుకుని తక్కినవాటిని వదలిపెట్టేశారు. దాని మీద ఆంధ్రదేశంలో చాలా తీవ్రమయిన ఆందోళన జరిగింది. తరువాత శ్రీ వెంకటరావుగారు ఆనాడు మంత్రిగా వచ్చినప్పుడు వారు అగ్రహారాలకు యీ 1936 సంవత్సరపు యాక్టు వర్తించే విషయం ఆలోచిస్తామని చెప్పడం, దానికి పెద్ద మహాసభ జరపడం, దానికి శ్రీ కళావెంకటరావుగారు రావడం వారికి జ్ఞాపకం వుంది. తరువాత వారిని అధిష్టానవర్గం (High Command) వారు pull up చేయడం కూడా వారికి జ్ఞాపకం. దాని ఫలితంగా మొత్తం మీద అది drop అయిపోయింది. ఆ drop కావడంలో ఎంతవరకు అయినదంటే—1936 వ సంవత్సరపు యాక్టు వరకు మాత్రమే మినహాయించి తక్కినవాటిని కలుపుదాం అనేటటువంటి అభిప్రాయంతో ఏకీభవించవలసి వచ్చింది. కనుక దీనికి చాలా చరిత్రవుంది. Abolition Act వచ్చిన వెంటనే ట్రిబ్యునల్సును వేయడం, కొన్ని గ్రామాలను ఎస్టేట్లుగా declare చేయడం జరిగింది. ఇందాక రివిన్యూ మంత్రిగారు చెప్పినట్లు ఆ Act తో పాటుగా మరొక Act కూడా చేశారు. అదే Rent Reduction Act. ఆ rent reduction లో యీ గ్రామాలు వస్తాయని notify చేశారు. ఆ విధముగా notify చేసిన దాని ఫలితంగా—నిజంగా యిప్పుడు నా మనస్సుకు బాధ వేసినది. శ్రీ అయ్యపురెడ్డిగారు చదివిన లిస్టు నాకు దొరకలేదు. మా జిల్లాలో 125 యినాం గ్రామాలని ప్రభుత్వపు లెక్కలలో వున్నటువంటివి వుంటే ఆ G.O. లో 30 గ్రామాలు మాత్రమే declare చేసినట్లు కనపడుతుంది.

శ్రీ ఇ. అయ్యపురెడ్డి: వారి జిల్లాలో 125 ఇనాం గ్రామాలుంటే 30 మాత్రమే వున్నట్లు నేను చదివానని వారు పొరపాటు పడుతున్నారు. నేను మూడవ batch లిస్టు మాత్రమే చదివానని తిరిగి చెబుతున్నాను.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య: సంతోషం. ఎందువల్లనంటే, ఒకవేళ ముప్పయ్యే వున్నాయి కాబోలని నాకు భయం వేసినది. 125 ఇనాం గ్రామాలు గుంటూరు జిల్లాలో

వున్నాయి. బహుశః అన్నీ declare అయినవేనని విన్నాను. అందువల్ల వారు చెప్పి నట్లు మూడవ batch లో మినహాయింపు చేశారని నేను అర్థం చేసుకోవాలి. కనుక నాకు ఆ అనుమానం తొలగిపోయింది. 125 ఇనాం గ్రామాలు ఒక గుంటూరు జిల్లాలో వుంటే వీటికి ట్రిబ్యునలు దగ్గరకు వెళ్ళేటప్పటికి ఆ ట్రిబ్యునలు తీర్పులన్నీ వ్యతిరేకంగా వచ్చాయి. ఈ ట్రిబ్యునలు తీర్పులు రెండు మూడు రకాలుగా వచ్చాయని యిందాక రివిన్యూమంత్రిగారు చెప్పారు. ఒకదాంట్లో minor inams వున్నాయనే కారణంచేతగాని, లేకపోతే 2, 3 పట్టా లిచ్చారనే కారణంచేతగాని వచ్చినవి.

శ్రీ కె. వెంకటరావు: నేను చెప్పినది ట్రిబ్యునలుకు సంబంధించినది కాదు. హైకోర్టు యిచ్చిన తీర్పులు రావడంవల్ల మేము సవరణలుపెట్టామనిచెప్పాను,గాని ట్రిబ్యునలు ప్రసక్తిలేదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య: కొన్ని ట్రిబ్యునలులో కూడా అట్లాంటివి వచ్చినవి అనుకుంటా. ఎట్లా తగ్గించడం జరిగింది అనే దానికి మరొక point చెప్పాను. వారు వ్యతిరేకించారని కాదు. అనేక కారణాలచేత అనేక గ్రామాలను మినహాయింపు చేస్తూ వచ్చారు. అందువల్ల నష్టం యేమి వచ్చిందంటే, రైతాంగం Rent Reduction Act క్రింద ప్రభుత్వం declare చేసినది కనుక సంతోషించి ప్రభుత్వం వేసినటువంటి cess చెల్లిస్తూ వచ్చారు. అంతలోకి మునసబు కోర్టుకు వెళ్ళి, అక్కడ కాకపోతే హైకోర్టువరకు వెళ్ళి దానికి stay తీసుకు వచ్చి, రద్దు తీసుకువచ్చారు. ప్రభుత్వం మీద stay తీసుకువచ్చారు. "ప్రభుత్వం, యివ్వాళ అధికారం లేనటువంటిది, Rent Reduction Act క్రింద declare చేశారు కనుక ప్రభుత్వం rent reduction ప్రకారం వసూలు చేయడానికి వీలు లేకుండా stay యీయాలని" చెప్పారు. కాని legal provision వచ్చిందక్కడ. ప్రభుత్వానికి వున్నటువంటి అవకాశాలలో ఒకసారి declare చేసిన తరువాత మళ్ళా చేయడానికి వీలులేకుండా వచ్చింది. అది రైతులకుపయోగపడింది. ఆ విధంగా వుండాలని కూడా నేను కోరుతున్నాను. అది మినహాయింపు చేసేటటువంటి పరిస్థితి యెప్పుడైతే లేకుండా పోయిందో యివ్వాళ్ళ కోర్టులు యిచ్చినటువంటి stay accept చేసి ప్రభుత్వం వసూలు చేయకుండా వుంటుందా? లేక ప్రభుత్వం stay ను లెక్కచేయ్య కుండా వసూలు చేస్తూండగా, ఇనాందారు తను కోర్టుకు వెళ్ళాలనేటటువంటి permission వుంది కనుక decree అనుకూలంగా వచ్చింది కనుక, యిట్లా estate కాదు కనుక "లా ప్రకారంగా ఏదయితే పూర్వం అడిగానో అది నాకు యివ్వాలసినదని" ఆయన అడగడం అనే సమస్య వచ్చింది. అట్లాంటివి ముఖ్యంగా మాతాలూకాలో గరికపాడు, మంగళగిరిపాడు అగ్రహారం వంటివి మా జిల్లాలో 40-50 సమస్యలున్నాయి. సమస్య వచ్చినప్పుడు ప్రభుత్వానికి వ్రాస్తే వారు చెప్పినదేమిటంటే, "ఇది declare అయినది కనుక మీరు ప్రభుత్వానికి సేనుచెల్లించాలి గాని వాళ్ళకే మీ చెల్లించ నక్కరలేదు" అని అవతల సివిలు అమీనాలు వచ్చేసి "మీరు యివి చెల్లిస్తారా లేక ఖాళీ చేస్తారా" అంటున్నప్పుడు మేము యేమి సలహా యివ్వవలెనో మాకు బోధపడలేదు. "అయితే భూములనుండి తొలగినట్లయితే హక్కుపోతుంది కనుక మీరు బాధపడ్డా సరే ప్రభుత్వానికి శిస్తు మొత్తం ట్రెజరీలో జమ కట్టేనండి; రెండో

అతను అడుగుతున్నాడు కనుక 1½ సంవత్సరమో 3 సంవత్సరాలో వుంటే అదికూడా యివ్వాడి." మన్నాము. కాని దాంతో యింకో చిక్కు వచ్చింది. ఏమిటంటే ఎప్పుడయితే యీ యాక్టు వచ్చిందో ఆ నాటికి ఇనాం దారులకు యివ్వవలసినటువంటి డబ్బు ఏదైతే వుందో అది అతను డిపాజిటు చేసినట్లయితే సరిపోతుందని వుంది. రెండు సంవత్సరాలు గనుక డిపాజిటు చేసినట్లయితే పోవడంతా పోతుంది. కాని రెండు సంవత్సరాలు డిపాజిటు చేశారు. ఆ తరువాత ప్రభుత్వం Rent Reduction Act క్రింద declare చేసినది. ఆరు సంవత్సరాలు డబ్బు వసూలు చేశారు కనుక ఆ ఆరు సంవత్సరాలు లెక్క తేల లేదు కనుక ట్రెజరీలో డిపాజిటు చేశారు. ఎప్పుడైతే ట్రిబ్యునలు దీనికి వ్యతిరేకంగా తీర్పు యిచ్చిందో అప్పుడు యీ ఎస్టేటు ట్రిబ్యునలువారి decision ప్రకారంగా ఆ ఇనాందారుకు వస్తే, "మీరు ఆరు సంవత్సరాల నుంచి కూడా నాకు డబ్బు చెల్లిస్తారా లేదా" అని అడుగుతాడు. అందువల్ల ప్రభుత్వం చెల్లించే డబ్బు అవతల Rent Reduction Act క్రింద డిపాజిటు చేసినది. ఇవతల ఆరు సంవత్సరాలనుంచి అతని లెక్క ప్రకారం యిరవయ్యో, ముప్పయ్యో, నలభయ్యో ఎంతయితే అక్కడ వేసి కొన్నాడో ఆ ప్రకారంగా "అంత డబ్బు నువ్వు డిపాజిటు చేస్తావా లేదా" అంటే పొలా న్నమ్మినా కూడా రానటువంటి స్థితి వుంది. కాని అక్కడ కూడా అతనితోటి రాజీపడి ఎలాగో మొత్తం మీద hold వదలవద్దు పొలాన్ని వదలినట్లయితే possession is half the right అనే పద్ధతిమీద ఆకాస్తాపోతే మొత్తం right పోతుంది కనుక మీరు వద వలసినదేనని. చెప్పాను, ఆ విధంగా జరగినటువంటి వాటిలో మనకు యిన్నాళ్ళు వచ్చిన అభ్యంతరాలు యితర వాటితో బాటుగా యిది ప్రధానమైనదని నేను మీకందరికీ మనవి చేయక తప్పదు. 1936 వ సంవత్సరపు యాక్టు ఒకటేవుంది కనుక దాంట్లో మినహాయింపు అనే వంకతో పోయింది. ఇవాళ్ళ ఆ చిక్కు తీరిపోతున్నందుకు సంతోషం. నేను చెప్పిన యితర కారణాలతో వున్నటువంటి వాటికి యేమి చేయాలనే సమస్య తేలడం లేదు. Rent Reduction Act క్రింద ఏవయితే declare చేశారో అవన్నీ కూడా estates గానే declare కావలసిన అవసరం వుందనేది నా point. తరువాత Estate Land Act క్రింద వచ్చినటువంటి యితర చిక్కులున్నాయి. క్రిందటి తడవ ఒక Act లో—clear గా ఆ Act copy దొరకలేదు కనుక వివరంగా తెలియ జేయలేక పోతున్నాను. ప్రభుత్వపు రివిన్యూ లెక్కలలో ఏ గ్రామాలైతే estates గా declare చేయబడివున్నాయో అవన్నీ కూడా వీటి క్రిందికే వస్తాయని చెప్పారు. అది ఏ Act కు అన్వయించిందో నాకు జ్ఞాపకం రావడంలేదు. అందువల్ల చెప్పలేకుండా వున్నాను. కర్నూలులో యీ సమస్య వచ్చింది. వచ్చినప్పుడు ప్రభుత్వ లెక్కలలో estates గా ఏవైతే declare చేశారో అవన్నీకూడా దీని క్రింద వస్తాయన్నారు. కాని అదే వచ్చినట్లయితే బాధ లేదు కాని, అది వస్తుందో రాదో యిక్కడ తేలలేదు.

మిస్టర్ స్పీకర్: ప్రభుత్వ లెక్కలలో ఎస్టేట్లు అని డిక్లేరుచేస్తే, ఎట్లాగా వస్తాయి, మీరు పేరో చెప్పడం ఎందుకు?

*శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య: ఎస్టేట్లు అనికాదు; ఇనాములని, ఎస్టేట్లు పోయాయి. అవి ఇప్పుడులేవు. ఇనాములు కూడా ఎస్టేట్లు అయిపోతాయి. "All inams are

declared to be estates" అని తేలితే ఇనాములు పేరు, ఎస్టేట్లు పేరు అని ఉండదు. మేజరు ఇనాములు ఎస్టేట్లు అవుతాయి; మైనర్ ఇనాముల సంగతి ఏమీలేదు. అగ్రహారాల సంగతి పేరు. పది సంవత్సరాలకు ఒకసారి జనాభా లెక్కలు ప్రకటించినప్పుడు ఈ గ్రామాలు రివెన్యూ గ్రామాలు, ఈ గ్రామాలు ఎస్టేటు గ్రామాలు, ఇవి అగ్రహారాలు అని ప్రకటించే మాన్యువలు ఉన్నది. గ్రామాలను గురించి ఆవిధంగా నోటిఫికేషన్ చేసినప్పుడు ఆవిధంగానే ఈ చట్టం అమలుకు తీసుకుంటేనే సమన్వయం కుదురుతుంది, లేకపోతే anomaly వస్తుంది. నోటిఫికేషన్ ఒక విధంగావేసి కోర్టుకు కాని, ట్రిబ్యునలుకుకాని పోతే నేను ఆవిధంగా ఒప్పుకోమని వారంటే anomaly వస్తుంది. కోర్టులు అవకాశంగా తీసుకుంటున్న చిక్కులను సమన్వయ పరచేటప్పుడు పేచీలులేకుండా fool proof గా అన్వయించేసి చట్టం చేయకపోతే....... .

మిస్టర్ స్పీకర్: Mere notification does not give any legal title. అందువల్ల ఈ చట్టంలోని నిర్వచనం క్రిందకు రావాలేకాని ఊరికే నోటిఫికేషన్ ఉన్నది కాబట్టి ఎస్టేటు అంటేఎట్లా? Tribunal has to look to that అవి కూడా include కావాలంటే దానికి వేరే ప్రయత్నం చేసుకోవాలి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య: "By mere notification they cannot prove the right" అంటున్నారు. నోటిఫికేషన్‌ను ఉన్నది; హక్కు ఉన్నదా, లేదా తేలడంలేదు. శిస్తు చెల్లించకపోతే మీ హక్కు పోతుందని గవర్నమెంటు చెబుతోంది. డబ్బు ఇవ్వకపోతే కోర్టు డిక్రీ ఉన్నది కనుక నిన్ను వెళ్లగొడతాను అని ఇనాందారు అంటాడు. ఈ రెండింటి మధ్య రైతు నలుగుతున్నాడు. అందుచేత ఒక నోటిఫికేషన్ ఇచ్చిన తరువాత దానిని గవర్నమెంటు బలపరచవలసి ఉంటుంది. అప్పుడు ప్రజలు అభినందిస్తారు. ఈ చట్టం అమలులో ఏ అభ్యంతరాలు వచ్చినా ఎన్ని సవరణలు తేవలసివచ్చినా ఎప్పుడుపడితే అప్పుడు తేవడానికి సంసిద్ధంగా ఉన్నాను అని రివెన్యూ మంత్రిగారు చెబుతున్నారు. గవర్నమెంటు accept చేసిన position ప్రకారం ఎన్ని whole inam villages ఉన్నాయను కుంటున్నారో వాటిని నోటిఫై చేశారు. వీటి విషయమై anomaly వస్తే కోర్టుల వ్యాఖ్యానాలలో పొరపాటువస్తే జడ్జిమెంటులలో అవకతవకలువస్తే వీటినన్నిటిని చట్టం ద్వారా సమన్వయం చేయవలసి యున్నది. అవసరమైతే జడ్జిమెంటు కాపీలు తెచ్చి ఇస్తాను. 3 *(ii) (d)* పెద్ద obstacle గా ఉన్నన్నినాళ్ళు ఎవరు help చేయలేరు. కర్నూలులో అనుకున్న ప్రకారం గవర్నమెంటు లెక్కల ప్రకారం ఇనాం ఎస్టేట్లుగా డిక్లేరు అయిన గ్రామాలకు సమన్వయ మయ్యేటట్లు బిల్లును fool proof గా, కోర్టులలో వ్యాఖ్యానాలవల్ల చిక్కులులేకుండా, తయారు చేయాలని కోరుతూ ఈ బిల్లును నేను బలపరుస్తున్నాను.

శ్రీ జి. లచ్చన్న:—అధ్యక్షా, ఇప్పుడు ప్రవేశపెట్టిన బిల్లును నేను బలపరుస్తున్నాను, ఈ బిల్లు చర్చలలో వస్తున్న సందర్భాలు అధ్యక్షులకు కూడా పూర్తిగా అనుభవమే. ఎస్టేట్ల

రద్దు అమలు లోనికి వచ్చిన తరువాత మిగిలిపోయిన గ్రామాలను కొన్ని గ్రామాలకు చెందిన కొన్ని భూములను రద్దు సిద్ధాంతానికి, రైతాంగం భూస్వామ్య హక్కుకు సంబంధం లేకుండా మినహాయించబడిన దానివల్ల వచ్చిన సమస్యలను, పరిస్థితులను చక్కబెట్టడానికి ఈ సవరణ చట్టాన్ని శాసనసభలో చర్చించు కుంటున్నాము. 1956 వ సంవత్సరంలో సవరణచట్టమును ప్యాసు చేసిన సందర్భంలో కూడా ఇటువంటి సమస్యలను పరిష్కరించాలని ఉద్దేశించి ఒక సంపూర్ణమైన సవరణ శాసనాన్ని తీసుకు రావడానికి ప్రభుత్వం ప్రయత్నించింది. కాని సవరణ చట్టంలోని భాషకు అర్థాలను గురించి న్యాయ స్థానాలవారికి సందేహాలు కలగడం వల్ల ప్రభుత్వం అనుకున్న ఉద్దేశం నేటివరకు నెరవేరకుండా పోతున్నది. Made, confirmed and recognised అనే మూడు పదాలనుండి మినహాయించబడిన భూములున్నాయా, లేవా అనే సమస్య నేడు జటిలంగా ఉన్నది. ప్రభుత్వం ఎస్టేట్ల limits లో ఉన్న ఏ భూమి అయినా సరే, రైతాంగంయొక్క భూస్వామ్యం హక్కునుండి మినహాయింపబడకూడదనే సిద్ధాంతం మీద, సూత్రం మీద, ప్రభుత్వ పక్ష శాసనసభ్యులలో కాని ఇతర పక్ష శాసనసభ్యులలో కాని ఎలాంటి భేదాభిప్రాయం లేదని నా విశ్వాసం. ఈ సవరణ చట్టాలలో మనం ప్రయోగిస్తున్న భాషవిషయమై న్యాయ స్థానాలకు సందేహాలు కలుగుతుండడంవల్ల ఈ సమస్య నాను నానుక్లిష్టం కావడం, ఎన్ని మారులు సవరణ చేసినా ఈ సమస్య నూతన పరిస్థితిని సృష్టించడం జరుగుతున్నది. శాసనసభ ఆయా పదప్రయోగం చేయడంలో వారి ఉద్దేశం ఏమై వుంటుందనే విషయం పరిశీలించడములో న్యాయ స్థానాలకు అనేక సందేహాలు కలుగుతున్నాయి. ఈనాడు మనం ప్రకటించడంలో ఎస్టేట్ల పరిమితికి లోబడిన ఏ భూమి అయినా భూస్వామ్య హక్కునుండి తొలగించబడడానికి వీలులేదు. ఈ ప్రధానమైన సూత్రాన్ని మనం స్పష్ట పరిస్తే ఈ సమస్యను యిటువంటి చిక్కులనుండి తొలగించ వచ్చును. ఫలానా గ్రామం మినహాయించ బడినదా, లేదా అనే విషయమై అందోళనకు అవకాశం ఉండదు. పదప్రయోగం దగ్గరే ఈ చిక్కులు వస్తున్నాయి, Abolition క్రిందకు వస్తుంది, భూస్వామ్య హక్కు వున్నదిఅనే నిర్వచనాన్ని స్పష్టంగా ప్రకటించినట్లయితేఈ సమస్యను పరిష్కారం చేయడానికి అవకాశం వుంటుందేమో అని నా మనవి. మరొక విషయంకూడా ఈ చర్చలలో వస్తున్నది. Inam in any village అని పద ప్రయోగం చేస్తే గవర్నమెంటు షరాయితీకి చెందిన ఇనాములకు కూడా ఇది వర్తించి అదనంగా సమస్యలుత్పన్నం అవుతాయనే ఆలోచన వల్ల అది వుండకూడదని ప్రభుత్వ ఉద్దేశం. ప్రభుత్వ ఉద్దేశంలో ఒక సబబు వున్నది, ఎస్టేట్లకు చెందిన కొన్ని గ్రామాలుకాని, కొన్ని ఎస్టేట్ల గ్రామాలకు చెందిన భూములు కాని మినహాయించబడినందువల్ల, ఆ సమస్యను పరిష్కరించడానికి సవరణ తీసుకు వస్తున్నారు కాబట్టి ఎస్టేటు పరిమితికి సరిహద్దుకు లోబడిన జమీందారీ ప్రాంతాలకు సంబంధించిన భూములకే ఈ సవరణ వర్తించాలి కాని ఇతర గ్రామాలకు, జమీందారీలకు సంబంధంలేని గవర్నమెంటు గ్రామాలకు, భూములకు వర్తించే పదప్రయోగం వుండకూడదు అనే గవర్నమెంటు ఉద్దేశం సరితే అని చెప్పడానికి ఏమాత్రం సందేహం లేదు. ఏ సూత్రాన్ని ఎస్టేట్లలోని ఇనాం గ్రామాల రైతులకు వర్తించి హక్కు ఇస్తున్నామో అదే సూత్రాన్ని గవర్నమెంటు జిరాయితీ గ్రామాలలోని ఈనాం రైతులకు ఎందుకు ఇవ్వకోకూడదనే ప్రత్యేకమైన సిద్ధాంతం, వాటన

వున్నది. అందులో సబబు లేదనికాదు. జమీందారీ రద్దు చట్టానికి ఇటువంటి ఏ సవరణ రావాలని మనం ఆత్రపడినా, ప్రయత్నించినా, ఆందోళన చేసినా, జమీందారీ రద్దువల్ల ఏర్పడిన క్లిష్ట సమస్యలను పరిష్కరించడానికి జరగనున్న ప్రయత్నానికి ప్రతిబంధకం అవుతుందేకాని మరొకటి కాదు. గవర్నమెంటు జిరాయితీలోని, గ్రామాలలోని ఇనాం రైతులకు కూడా ఇటువంటి హక్కు వుండాలా, వద్దా, అనేది ప్రభుత్వం ఉద్దేశిస్తున్న భూ సంస్కరణల సందర్భంలో తప్పని సరిగా చర్చించవలసి వుంటుంది ఆ విషయమై సరియైన రక్షణ కలిగించాలి కాని జమీందారీ రద్దు చట్టానికి వచ్చిన ఈ సవరణ చట్టంలోనే ఈ సమస్య పరిష్కారం అవాలని ఉద్దేశించినట్లయితే రద్దుచట్టం వల్ల వచ్చిన సమస్యల పరిష్కారానికే ప్రతిబంధకంగా ఉంటుంది అని నా మనవి. ఈనాడు మనం కోరవలసింది. ఎస్టేటు సరిహద్దులకు లోబడి వున్న ఏ భూమి అయినా, ఏ గ్రామమైనా, ఖండ్రిక అయినా, ఎకరం అయినా, 5 సెంట్లు అయినా, రైతాంగానికి భూస్వామ్య హక్కు క్రింద, రద్దు సూత్రం క్రింద వర్తించేటట్లు చేయాలి అని. అటువంటి అవసరం ఎంతైనా ఉన్నది. ఇప్పుడు వాడుతూ వున్న పద ప్రయోగాలలో న్యాయస్థానాలకు సందేహాలు కలిగించే అవకాశాలు ఉంటే ఆ విషయాన్ని స్పష్ట పరచి ఎస్టేటు ప్రాంతాలకు చెందిన—

మిస్టర్ స్పీకర్ :—ఎస్టేటు అంటే ?

శ్రీ జి. లచ్చన్న :—జమీందారీ

మిస్టర్ స్పీకర్ :—జమీందారీ కాని ప్రాంతాలలో ఈనాం గ్రామాలున్నవి.

శ్రీ జి. లచ్చన్న :—అవి జిరాయితీ గ్రామాలు.

మిస్టర్ స్పీకర్ :—ఎస్టేట్లలోనూ ఈనాం గ్రామాలుండవచ్చును; ఎస్టేట్లకు బయట ఇనాం గ్రామాలుండ వచ్చును. We are only dealing with the Inam villages వాటికి సంబంధం ఎందుకు ?

శ్రీ కె. వెంకటరావు :—లచ్చన్నగారి పాయింటు ఏమిటంటే ఫలానాది ఎస్టేటు అని అనుకున్న తరువాత ఏ వంక క్రింద నైనా ఒక సెంటు కూడా బైటకు వదల కూడదు, రైతు హక్కు క్రిందకు రావాలని; మిగిలిన ఇనాం భూములకు దీనికి సంబంధం లేదు అని, వాటికోసం దానిని ఆలస్యం చేయవద్దు అని

మిస్టర్ స్పీకర్ :—ఎస్టేటు అయితే కదా అది. ఇనాంకు జమీందారీకి సంబంధం అక్కర లేదు.

శ్రీ. జి. లచ్చన :—ఉయ్యూరు ఎస్టేటు ఉన్నది అనుకోండి. ఆ ఎస్టేటు సరిహద్దులో ఉన్న భూమిని కూడా మినహాయించ కూడదు అని నా ఉద్దేశ్యం. 3(*ii*)(*d*) నిర్వచనం క్రింద రాకుండా మిగిలిపోయిన భూములు ఇందులో చేర్చాలనే ప్రభుత్వంతెచ్చే ఈ బిల్లు యొక్క ఉద్దేశ్యము. ఆ ఉద్దేశ్యం పూర్తిగా నెరవేరాలంటే ఇప్పుడువున్న భాషను స్పష్టపరచాలి. న్యాయస్థానములకు సందేహాము కలుగనిరీతిగా భాషా ప్రయోగము చేయటం మంచిదని నామనవి.

*శ్రీ కె. కోటిరెడ్డి: అధ్యక్షా, **Land tenures** లో మధ్యవర్తులు లేకుండా చేయాలని ఈ బిల్లు ఉద్దేశ్యము. ఆ విషయంలో ఎవరికీ అభిప్రాయ బేధములులేవు. 1948లో ఎబాలిషన్ యాక్టు క్రింద చేరనటువంటి గ్రామాలనుచేర్చి ఇనాందారులను లేకుండా చేయాలనే ఈ బిల్లు ఉద్దేశ్యము. అయితే ఆ ఉద్దేశ్యం నెరవేర్చటంలో భూస్వాములకుగాని, ఇనాం దార్లకుకాని ఏమీ చెరుపురాకుండా చూడాలి. ఎవరికీ చెఱుపు కలగని విధానాన్ని ప్రభుత్వము ఆలోచించవలసివుంది. ఆ కారణంవల్లనే చాలా విపులముగా పరిశీలించిన పిదప 1908 లో **Madras Eatats Land Act** లో కొన్ని గ్రామాలను మినహాయించారు. మేలువరం. కుడివరం, ఈ రెండు హక్కులు ఏ ఇనాందారుకు ఉన్నవో అటువంటి వాటిని మినహాయించినారు. మేలువరం హక్కు భూస్వాముల హక్కు. పన్ను వసూలుచేసే హక్కు. కుడివరం హక్కు రైతుల హక్కు, భూమి సాగుచేసుకొనే హక్కు, ఈ రెండు హక్కులు కలిగిన వారిని అప్పుడు మినహాయించినారు. ఇంతకాలంనుండి రాజులు మొదలైనవారే పన్నులు వసూలు చేసుకొంటున్నారు. అదే భూస్వాముల హక్కు. రెండవ హక్కు భూమి సాగుచేసుకొనే వారిది. 1908 యాక్టును అనేకసార్లు సవరించవలసి వచ్చింది. ముఖ్యమైన యాక్టు 1936లో జరిగింది. మేలువరం, కుడివరం, ఈ రెండు హక్కులుగల గ్రామాలను కూడా 1908 యాక్టులో చేర్చవలసిందని బొబ్బిలి రాజాకాలంలో చేశారు. శిస్తు చెల్లించని సందర్భంలో సాగువాయకముగా ఉపయోగించని సందర్భములో రైతు స్వాధీనములోగల భూమిని తీసికొనకుండా నిలుపుదలచేసి, రైతుకు కొంతహక్కు కల్గించటానికి ఈ చట్టం చేయటం జరిగింది. అయితే ఆ చట్టంలో భూస్వాములు వసూలుచేసే **rent** ను మాత్రం అప్పుడు తగ్గించలేదు. 1947 లో ఈ జమీందార్లను, ఇనాందార్లను, ఈనాం ఎస్టేట్లను రద్దుచేయాలనే ఆలోచన కల్గింది. ఆ కారణంవల్ల 1948 లో ఈ ఎబాలిషన్ యాక్టు క్రింద జమీందార్లను, జమీం దార్ల ఎస్టేట్లును రద్దుచేశారు. ఒక్క భూస్వామి హక్కుగా మాత్రమేవుండే ఇనాంలను ఈ యాక్టు క్రింద రద్దుచేయటం జరిగింది. మేలువరం హక్కు, కుడివరం హక్కు ఈ రెండు హక్కులు కలిగిన ఇనాంలను మాత్రం రద్దుచేయలేదు. 10 సంవత్సరాలు జరిగిన తరువాత ఇటువంటి ఇనాములను కూడా రద్దుచేయాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ఈ బిల్లును తెచ్చింది. కుడివరం, మేలువరం, ఈ రెండు హక్కులు కలిగిన ఇనాంలను ప్రభుత్వం రద్దుచేసినా, ఒక్క మేలువరం హక్కుగల ఇనాములకు దానికి ఏమీ బేధంలేదని చెప్పే ఈ ప్రభుత్వము అప్పుడే ఈ ఇనాములను కూడా ఎందుకు **abolish** చేయలేదో నాకు అర్థం కావటంలేదు.

ఒకవేళ జమీందారులకు, ఇనాందార్లకు కాంపెన్‌సేషన్ ఇవ్వవలసివస్తే హెచ్చు మొత్తం ఇవ్వవలసివస్తుందని యీ ఆలోచన చేసినారా అని అనుకొందా మన్న ప్పటికీ ఆనాడు మద్రాస్ రాష్ట్రంలో జమీందారులకు 12, 15 కోట్లు రూపాయల వరకు ఇవ్వ గలిగినటువంటి ప్రభుత్వం, యీదినం లెక్కలు ప్రకారం ఇనాందారులకు రూ. 140 లక్షలు ఇవ్వజాలక పోయినదా? అది కారణము కాదని నేను అనుకొంటున్నాను. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో 12 కోట్లవరకూ జమీందారులకు కాంపెన్‌సేషన్ ఇవ్వడానికి సిద్ధపడినవారు 140 లక్షల రూ. లు ఇనాందారులకు చెల్లింపలేకపోవడమనేది కారణంకాదు.

బహూశా రైత్వారీ హక్కు కలిగినటువంటి యీ ఇనాములను అబాలిష్ చేయవలెనంటే ఏదో కొంత భేదమును చూపించకపోతే ఆ యాక్టును ప్రసిడెంటుగారు గాని ఇతరులుగాని ఒప్పుకుంటారా అనే సందేహం కలిగియుండవచ్చు. లేక యీ 2 రకముల ఇనాములకు భేధం చూపించకుండా అబాలిష్ చేసినట్లయితే బాగుండదని అనుకున్నారేమో నాకు తెలియదు.

మిస్టర్ స్పీకర్ : అప్పుడు రెంట్ రిడక్షన్ యాక్టు అములు పరిచాము.

శ్రీ కె. కోటిరెడ్డి : మేల్వారం, కుడివరం రెండు హక్కులుగల ఇనాములను అబాలిష్ చేయవలసివస్తే వాటికి హెచ్చు కాంపెన్సేషన్ ఇవ్వవలసి వస్తుందని మాత్రం మినహాయింపు చేసి పిమ్మట ఆలోచన చేయవచ్చుననే ఉద్దేశ్యముతో 1949 సం. లో ఆ ఇనాములను జమీందారీ రద్దు చట్టములో చేర్చలేదని నేను అనుకుంటున్నాను. ఏ కారణములవల్లనైతేనేమి యీ ఇనాములను మినహాయించడం జరిగింది. ఇప్పుడు ఆ ఇనాములను కూడ రద్దు చేయవలెనని మన ప్రభుత్వం ఉద్దేశించినది. ఆ ఉద్దేశ్యమును నిర్వర్తించేందుకు ఎవరికీ ఆక్షేపణ లేదు. అన్ని గ్రామాలలో రైత్వారీ సెటిల్మెంట్ ఉండటం మంచిదే. మేల్వారం హక్కు ఉన్న ఇనాములను రద్దు చేయడం జరిగింది. అక్కడ ఉండే ఇనాందార్లకు రైత్వారీ పట్టాల విషయంలో కొన్ని హక్కులు ఉన్నాయి. ఇప్పుడు ఉద్దేశించినటువంటి బిల్లుకూడా అదే. స్టేట్‌లో అదే విధానంలో, అదే కాంపెన్సేషనతో పెట్టారు. అయితే యీ రెండు రకముల ఇనాములకు కొంత బేధం లేదా? అట్లా లేనట్లయితే యీ ఇనాములను ఇంతవరకు అబాలిష్ చేయకుండా ఉండడం ఎందుకు? ఈ రెండు రకముల ఇనాందార్లకు కొంత భేదం ఉన్నదనే విషయం ఆనాడు గుర్తింపబడినది. మేల్‌వరం, కుడివరం రెండు హక్కులుగల ఇనాం గ్రామాలలోని ఇనాందార్లకు కొన్ని వసతులు ఏర్పాటు చేయడంవల్ల ప్రభుత్వానికి కాని లేక రైతులకు కాని ఏపాటి నష్టం లేకుండా చేయవచ్చు. ఇనాందారు అంటే జమిందారుగానే సాధారణంగా కొందరు భావించడం జరుగుతున్నది. అది సరి అయినటువంటి పద్ధతికాదు.

ఇనాములలో **Pre-Settlement inams** అనికొన్ని ఉన్నాయి. ఎన్ని సంవత్సరముల క్రిందటనో, ఎన్ని శతాబ్దముల క్రిందటనో మహమ్మదీయ నవాబులు, హిందూ పాదుషాలు అనేక గ్రామాలు కొంత మందికి ఇనాములుగా, ఇచ్చారు. నిర్జనమైనటువంటి స్థలాలు, ఏర్రైతు లేనటువంటి స్థలాలు కూడా ఇచ్చారు. అప్పుడు పూర్తి గ్రామాలను బ్రాహ్మణులకు ఇచ్చారనుకొంటాను. ఇతరులకు పూర్తి గ్రామాలను ఇచ్చినట్లులేదు బ్రాహ్మణులకు కూడా మీరు ఈ బీడు భూములు తీసుకొని, దున్నుకొని, సాగుచేసుకొని తటాకాలు నిర్మించి, బావులు త్రవ్వించుకొని సాగుచేసుకోవచ్చునని చెప్పిన విషయాలు దాన శాసనములలో కనిపిస్తుంది. అయితే సామాన్య రైతులు ఉన్నచోట పెయ్యిరూపాయిలు పన్ను ఉంటే ఈ ఇనాందార్లకు, రూ. 100 లో లేక రూ. 50 లో చెల్లించమనే పదుపాయం కూడా చేయబడి ఉంటుంది. అప్పటినుంచి ఇనాందార్లు ఆ భూములను సాగుచేసుకుంటున్నారు. రైతులకు కూడా ఇచ్చారు. రైతుల వద్దనుంచి తీసుకుంటున్నారు. ఈ విధంగా ఇంతకాలంగా జరుగుతున్నది. 1936 వ సంవత్సరంలో ఈ ఇనాములను కూడా ఎస్టేట్లుగా మార్చారు. కాని తదుపరి 1948 లో వీటిని జమీందారీ రద్దు చట్టంనుంచి మినహాయించడం జరిగింది. అయితే

ఈ విధంగా రైతుకు కష్టం లేకుండా, ఈనాందారుకు కష్టం లేకుండా కొన్ని వసతులు ఇనాందారులకు కలుగచేయడం వల్ల ఇనాందారుకు న్యాయం కలుగచేసిన వాళ్ళం అవుతామని మనవి చేస్తున్నాను. దానివల్ల ప్రభుత్వానికి ఎట్టి ఇబ్బంది ఉండదు. రెండు రకముల ఇనాములకు బేధం చూపించ వలసిన అవసరం ఉన్నది. ఈ ఇనాములకు హెచ్చు కాంపెన్సేషన్ ఇవ్వడం న్యాయమైనప్పటికి నేను దానిని కోరడం లేదు. హెచ్చు కాంపెన్సేషన్ ద్రవ్య రూపంలో ఇచ్చే శక్తి ప్రభుత్వానికి ప్రస్తుతం లేకపోవచ్చు. కాబట్టి ఎవరికి ఇబ్బంది లేని విధంగా కొన్ని సౌకర్యాలు ఇనాందారులకు కలుగచేయవలసినదని కోరుచున్నాను.

ఈ ఇనాం గ్రామాలలో ఇనాందారు స్వంతంగా సాగుచేసుకుంటున్న భూములు కొన్ని ఉన్నాయి. ఈ ఇనాములను ఎస్టేట్సుగా మార్చే విషయంలో వాటిని 1948 వ చట్టంలోని క్లాజులకే రిఫర్ చేస్తున్నారు. ఆ చట్టంలోని డెఫినిషన్సే ఆ చట్టంలోని క్లాజులనే మేల్‌వరం, కుడివరం రెండు హక్కులు గల ఇనాములకు అన్వయింప జేస్తున్నారు. ఇనాందార్లు సాగు చేసుకుంటున్న భూములకు పట్టాలిచ్చే విషయంగురించి కొంతవరకు 1948 వ సం. రపు శాసనంలో ఉన్నది. దాని ప్రకారంగా 1–7–1945 వ తేదికి ముందు ఇనాందార్లు సాగుచేసుకుంటున్న భూములను వారికి పట్టాలు ఇవ్వవచ్చునని ఉన్నది. యీ నాడైనా 1–7–1945 కు ముందు నుంచి సేద్యం చేసుకుంటునట్లు రుజువు చేసినట్లయితే యీనాందారుకు పట్టావస్తుంది. 1948వ సం. లో శాసనం చేసేటప్పుడు మేల్‌వరం, కుడివరం రెండు హక్కులు ఉండే ఇనాములను ఎట్లా చేస్తే బాగుంటుందనే విషయమై చాలా విచారణ జరిగింది. 3, 4 సంవత్సరములలో ఎలాంటిరేటు ఎంక్వైరీ జరిగింది. ఇంకా పెండింగు గా ఉన్న విషయాలు కొన్ని ఉండవచ్చు. ఈ విధంగా జరిగిన తరువాత కూడా బీడుగా ఉన్న భూములను రైతుస్వాధీనంలో లేని భూములను రైతు స్వాధీనంలో ఉన్నా వాళ్ళు సాగుచేయలేక ఎబాండన్ చేసి సరెన్‌డర్ చేసిన భాగములను ఈ ఇనాందార్లు సాగుచేస్తూ ఉంటే వాటిని ఇనాందార్లకు పట్టాకు ఇవ్వడం పెద్దనష్టమా ? ఆ భూమికు ఒక రైతు లేడు ? ఎవరికి ఆ భూమి మీద హక్కు లేదు. అటువంటి వాటిని ఇనాందారు సాగుచేస్తున్నాడు. 10 లేక 12 సంవత్సరములుగా Grow More Food Campaign ద్వారా ట్రాక్టర్లు ఇస్తాము, అప్పులు ఇస్తాము అని ప్రభుత్వం ప్రచారం చేయడంవల్ల కొంతమంది ఇనాందార్లు ఈ బీడు భూములను ఎంతో ప్రయాస కోర్చి సాగులోనికి తీసుకొనివచ్చారు. ఈ విధంగా బీడు భూములను ఇనాందార్లు సాగులోనికి తీసుకొనిరావడం పెద్ద తప్పా? బీడు భూములను, రైతు స్వాధీనంలో లేని భూములను 7, 8 సంవత్సరములుగా, 1–7–1945 కు పిమ్మట ఇనాందార్లు సాగుచేస్తూ ఉంటే ఈనాందారుకు పట్టా ఇవ్వడం వల్ల ఎవరికి ఇబ్బంది ఉండదు. రైతు ఆ విధంగా సాగుచేసి ఉంటే ప్రభుత్వంవారు సంతోషించి ఉండేవారు. అయితే ఇకముందు భూములు లేనివారికి యీ భూములను ఇస్తారు అనుకొనవచ్చు. ప్రభుత్వం 10 సంవత్సరముల నుంచి ఇనాందారు సేద్యం చేసి ఫలితం అనుభవిస్తూన్నాడు అనుకోవచ్చు, అయితే కొంతమంది సేద్యంగురించి తెలియని వాళ్ళకు ఒక ఉద్దేశం ఉండవచ్చును. ఏ 5, 6 సంవత్సరములో సేద్యం చేసుకున్నాడు, 3, 4 సంవత్సరములు దానివల్ల ఫలితం పొందలేదా? అని అనుకోవచ్చు. ఇవాళా అంతో ఇంతో సేద్యం గురించి తెలిసినవాళ్ళు ఆ విధంగా దురభి

ప్రాయముపడరు. క్రొత్త భూములను సాగు లోనికి తీసుకొని రావలెనంటే మొదటి 3, 4 సంవత్సరాలు ఎంతో కష్టపడి, ఎంతో ఖర్చుపెడితే కాని ఫలితం రాదు.

ఇనాందారు కూడా పబ్లిక్ సర్వీస్ చేశాడు. Grow More Food, యితర విధాలుగా production అభివృద్ధి చేశాడు. అటువంటి వానికి కుడివరం హక్కు, రైతుహక్కు, వ్యవసాయం హక్కు—ఈ ఆక్టువల్ల లేకుండాపోతే, అతను హెచ్చుగా కోరటం లేదుకాబట్టి కొంతైనా compensation యివ్వకూడదా? ఇవ్వడం న్యాయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. 1–7–1945 పిమ్మట ఇనాందారు, తెనెంటుకు actual గా consideration యిచ్చి కొనుక్కొని ఉన్నా, దానం యిచ్చినది తెనెంటు నుంచి కొనుక్కొని ఉన్నా, అటువంటి భూముల మీద హక్కు ఉండదు. అటువంటి సందర్భములలో ఇనాందార్లకు హక్కు కలిగించవలెనని నా కోరిక. ఇప్పటికీ, రైతు స్వాధీనములో లేని, సేద్యము చేయని, బీడు భూములు ఉన్నాయి. అటువంటి వాటి విషయంలో, ఇనాందార్లకు కొంతైనా యివ్వవలసినదని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇనాందార్లు ఎన్ని ఎకరాలు సాగు చేస్తున్నారో, అంతవరకు యివ్వవచ్చునని, కొంతమంది అభిప్రాయ పడవచ్చును. వాస్తవంలో సాగుచేసే ఇనాందార్లు చాలా కొద్దిమంది ఉంటారు. అందరికీ 4 వేలు, 10 వేలు—ఎకరాలు ఉండవు. 50 80, 100, లేక 200 లోపు ఉండవచ్చును. వారు యింతో, అంతో, సాగుచేసి ఉండవచ్చునని లేక కొన్ని బీడుగా ఉన్నవి సాగుచేశారని అనుకొందాము. వీటికి పట్టా యిచ్చినాడు అనుకొందాము. రేపు లాండ్ రిఫారమ్సు రాబోతున్నవి. లాండ్ రిఫారమ్సుకొరకు ప్రచారం జరుగుతున్నది. దానికి త్వరలో మనం ఆక్టు చేయవలసి వస్తుంది. దాని ప్రకారం 50 ఎకరాలు వస్తుందో, 10 ఎకరాల వస్తుందో చెప్పజాలము. ఎంత వచ్చినా లాండ్ రిఫారమ్సు వచ్చినప్పుడు యిది అంతా దానిక్రిందకు వస్తుందికదా?

[*Mr. Deputy Speaker in the Chair*]

అందువల్ల ఆ భయము కూడా ఏమీ లేదు. కాబట్టి ప్రభుత్వం అటువంటివారి విషయం ఆలోచించుట న్యాయం. ఇనాందార్లు కూడా మనుషులే. 10, 15 సంవత్సరాలు పబ్లిక్ సర్వీస్ చేశారు. క్రొత్త భూములు, బీడు భూములు, రైతులు వదిలిన భూములు సాగుచేసి దేశానికి ఉపకారం చేసినటువంటి వారికి, ఈ దినం ఎలాంటి compensation లేకుండా చేయటం న్యాయంకాదు. ఇదివరకు రైతు స్వాధీనంలో ఉన్న భూమికి, compensation వస్తుంది. వాళ్ళు రెంట్ యిస్తారు. ఈ దినం ఇనాందారు సాగుచేసే భూమి, పట్టా లేకుండా ఉంటే compensation రాదు. కొంతమంది జమీందార్లు వేలకొలది ఎకరాలు ఉన్నవారు, బినామిగా ఎవరిపేరో వ్రాసి యిచ్చారనే అభిప్రాయం ఉన్నది. కొంత సత్యం ఉండవచ్చును. కాని ఇనాందార్లకు వేల ఎకరాల భూమి ఉన్నదా? కాబట్టి అటువంటి వాని విషయం సదభిప్రాయంతో చూడవలెనని కోరుతున్నాను. కొంతమంది ఇనాం ఎస్టేట్సులో రైతులకు కూడ భూమి యిచ్చారు. జూలై 1, 1945 పిమ్మట రైతుకు భూమి యిచ్చివుంటే, ఆ భూమిని సాగు చేసుకుంటూవుంటే, అతనికి ఈ ఆక్టువల్ల ప్రైటిల్ రాదు. ఇనాందార్లకు స్వంత

భూములు, సాగుచేసే భూములకు, బీడు భూములకు పట్టా యివ్వడం; కుడివరం, మేలువరం—రెండూ రద్దు చేసే సందర్భంలో కొంతవరకైనా compensation యిచ్చే విషయం ఆలోచించాలి. భూములు ఎవరి చేతులో లేకుండా వుంటే తన యిష్టమువచ్చిన వారికి ప్రభుత్వం యివ్వవచ్చును. కాని పూర్వంనుంచి భూములు తమవేననుకొన్నారు. అటువంటి వారికి కొంతవరకైనా న్యాయం కలుగ చేయుట అవసరం. వారిని అనవసరమైన యిబ్బందులుగాని, కష్టములుగాని పెట్టవలసిన అవసరంలేదని, వారి విషయంకూడ ఆలోచించవలెనని కోరుతూ ముగిస్తున్నాను.

శ్రీ బి. శ్రీరామమూర్తి: అధ్యక్షా! దీనికి ఒక సవరణ ప్రతిపాదించుచున్నాను. ఆసవరణకు అనుకూలమైన మేరకు కొద్ది విషయాలు మనవి చేస్తాను.

శ్రీ కె. వెంకటరావు: అది అమెండ్‌మెంట్ వచ్చినప్పుడు చెప్పాలి. జనరల్ డిస్కషన్‌లో సవరణ విషయమై మాట్లాడవద్దు.

శ్రీ బి. శ్రీరామమూర్తి: శ్రీకాకుళం జిల్లాలో పరిస్థితి గురించి చెపుతాను. పదాలు ఏవి ఉపయోగించినా, యిచ్చిన సబ్జెక్ట్ అందరూ ఒకటే యిస్తున్నారు. అది ఏమాత్రం మరచిపోవలసిన విషయంకాదు. దీనిమీద చాలా చర్చలు జరిగాయి. శ్రీ శంకరయ్యగారు చాలావరకు చెప్పారు. కొన్ని రకాల ఇనాములు—ఎస్టేటు అనే నిర్వచనం క్రింద తీసుకొరావలసిందని వారు చక్కగా వాదించారు. వారి అభిప్రాయంతో చాలావరకు నేను ఏకీభవిస్తున్నాను. శ్రీకాకుళం జిల్లాలో, పార్వతీపురం తాలూకా సీతారాంపురం అగ్రహారం ఉన్నది. అక్కడ ఉన్న రైతాంగానికి భూమి మీద హక్కు లేకుండా పోయింది. దానికి కారణం కోర్టు యిచ్చిన తీర్పు. మొత్తం గ్రామము అంతా whole inam village అని వాదన చేశారు. ఇనాందార్లు వాదనలో, ఇది ఖండ్రిక అవుతుందని, జిరాయితీ గ్రామానికి సంబంధించిన ఖండ్రిక అవుతుందని వాదన చేశారు. కోర్టువారి తీర్పు రైతులకు ఏవిధం గా వక్రించిందో నేను మనవి చేస్తాను. ఇదివరకు చట్టములో "Any hamlet or khandrika in an Inam Village of which the grant of an inam has been made,"—అది ఎస్టేటు క్రిందకు వస్తుందని ఉన్నది. "Any hamlet or khandrika in an inam village" అని యిక్కడ అవలేదు. అది "of jirayati village" అయినది; కాబట్టి జిరాయితీ విలేజికి సంబంధించిన ఇనాం గ్రామం కూడ ఎస్టేటు నిర్వచనలలోకి రాదు కాబట్టి దానికి ఈ చట్టం వర్తించదని, రైతులకు భూమిమీద హక్కు లేదని తీర్పు వచ్చింది. ఇంతేకాదు. ఆంధ్ర టెనెంట్ ప్రొటెక్షన్ ఆక్టు క్రింద పెటిషన్ వేసి భూమినుంచి తప్పించటం జరిగింది. రైతులు ఏమని వాదించారంటే— "ఈ ఆర్డినెన్సు రాకముందు నుంచి భూమిమీద ఉన్న రైతులం కాబట్టి, మమ్ములను తప్పించటానికి వీలులేదు" అన్నారు. కాని అదికూడ చెల్లలేదు. ఎందువల్లనంటే ఆర్డినెన్సులో " "All tenants subsisting on the date of promulgamation of the Ordinance" అని ఉన్నది. అయితే ఈ ఆర్డినెన్సు

రాకపూర్వం రైతులకు quit notice యిచ్చినారు కాబట్టి, అది effect అయి లైసెన్సీ terminate అయిపోయినట్లు కోర్టు భావించింది. అందుచేత ఈ ఆర్డినెన్సు వలన రైతులకు ప్రయోజనం లేకపోయింది. ఇదే రకంగా యింకా చాలా గ్రామాలు ఉన్నవి—పార్వతీపురం బొబ్బిలి తాలూకాలలోని కొన్ని గ్రామాల పేర్లు మనవి చేస్తాను. పోలు నాయుడు వలస, సీతారామపురం, దేశిక అగ్రహారం, గదగొలస, రాజనవలస, పూనాయువలస, నీలకంఠపురం, రాజయ్యపేట, కోటిపల్లి అగ్రహారం, మాధవరాయపురం,—ఇవి ఆ తాలూకాలకు సంబంధించిన గ్రామాలు. మొదటినుంచి ఇక్కడ ఏ రకంగా వాదన జరుగుతున్నదో, ప్రస్తుతం కూడా అదే విధంగా జరుగుతున్నది. కేవలం పదప్రయోగం మీద పట్టుదల చూపించి, కోర్టుల చుట్టూ తిరిగే పరిస్థితి పార్టీలకు పడుతోంది. ఇదమిద్ధంగా, సుస్పష్టంగా, ఇచ్చిలేమైనటు వంటి విధానాన్ని అనుసరించి రైతులకు భూస్వాములకు ఉన్నటువంటి హక్కులను నిర్ణయించటం జరగనటువంటి పరిస్థితులు యీనాటికి కనపడుతున్నవి. అందువల్ల ప్రతిగ్రామంలోను తగాదాలు వెచ్చిపోతున్నాయి. తగాదాలు రాచుకొంటున్నాయి. ఇనాములమీద ఉన్నటువంటి హక్కులో ఎవరికి వస్తాయో, ఎవరికి పోతాయో, ఎవరికీ తెలియదు. కాని ఉన్నటువంటి ఆస్తిపాస్తులు మాత్రం హరించుకుపోయే పరిస్థితులు ప్రతి గ్రామంలోను కనబడుతున్నాయి. ఇదివరకు ఉన్న పరిస్థితే ఇప్పుడు కూడా ఉన్నది. ఇప్పటికైనా ఒటువంటి లోపాలను సవరించి, తగినటువంటి శాసనంచేసి కట్టుదిట్టమైన పరిస్థితులు కలిగిస్తారని నేను ఆశిస్తున్నాను. ఇదివరలో, ఆంధ్రదేశం మొత్తంమీద ఇనాములన్నీ రద్దు చేయాలని కోరుతూ సోషలిస్టుపార్టీ ఒక ఉద్యమాన్ని లేవ దీసింది. ఈ ఉద్యమాన్ని సోషలిస్టుపార్టీ ప్రారంభించటమే కాదు. ఇనాములన్నీ సంపూర్ణంగా రద్దు కావాలని ఆంధ్రదేశంలోని ప్రతి ఒక్కరూ కోరుతున్నారు. ఇనాములన్నీ సంపూర్ణంగా రద్దుకావాలని కోరుతూ అందుకు ప్రయత్నించటానికి పూనుకోవటం నిజంగా ఆనందించవలసి నటువంటి విషయమని నేను అనుకొంటున్నాను. ఐతే ఈ శాసనాన్ని అమలు చేయటంలో ప్రభుత్వం ఎటువంటి విధానాన్ని అవలంబిస్తున్నదో, ఆ విధానాన్ని మనం ఏ విధంగా ఎదుర్కోవలసి వస్తున్నదో చూడవలసి ఉన్నది. ఇనాము సమస్య ప్రత్యేకించిన సమస్య. మొదటి నుంచీ ఇనాము సమస్యను భూ సంస్కరణలతో సంబంధంలేకుండా విడిగా చూస్తున్నాము. భూ సంస్కరణలు తేవటానికి ప్రయత్నం చేస్తున్నటువంటి యీ రోజుల్లో, ఇంతవరకు ఇనాము సమస్యలో మనం ఏరకంగా ప్రవర్తించాము అన్నది చూసుకోవలసిన అవసరం ఉన్నది. మొదటి నుంచీ దీనిని హాఫ్ హార్టెడ్‌గా, పీస్ మీల్ మెజర్ గా చూడటం జరుగుతోంది. ఈ సమస్యను పరిష్కరించటానికి జాగు, జాప్యం చేయటం జరుగుతోంది. ప్రభుత్వం యీ విషయంలో తన అశక్తిని, అసమర్థతను చూపిస్తూవచ్చింది. ఈ జాగుకు కారణం, ప్రభుత్వం యొక్క అసమర్థత కాకపోతే ఏమిటి? భూసంస్కరణలను ప్రవేశ పెడతామని అన్న మరుక్షణంనుంచి, తాత తండ్రుల నుంచి, వంశపారంపర్యంగా సాగుచేసుకొంటున్నటువంటి వందలాది పేద రైతాంగాన్ని భూముల నుంచి భూస్వాములు వెళ్ళకొడుతూంటే ప్రభుత్వం చూస్తూ ఊరుకొనే పరిస్థితి ఏర్పడింది. భూసంస్కరణలు తెస్తామని ప్రభుత్వం చేసిన ప్రకటనవల్ల కొన్నివందల రైతాంగం తొలగింపులు పెరిగిపోతున్నాయిగాని తగ్గటం లేదు. ప్రభుత్వ ప్రకటనవల్ల వస్తున్న ఫలితం ఏమిటి?

భూమి దున్నుకొంటున్నటువంటి రైతులకు నష్టం కలుగుతున్నది. ప్రభుత్వం ప్రకటించినటువంటి ప్రకటనల యొక్క ఆశయాలను కార్య రూపంలో పెట్టించటానికి, ప్రజలు ఆందోళన, అలజడి చేయవలసివస్తోంది. కరివెంలో సత్యాగ్రహం చేసిన, ఇనాం రైతులకు ఇస్తామన్న నప్పుడు హక్కులను ఇచ్చి తీరాలని అందుకు తగిన చట్టాన్ని వెంటనే తీసుకురావాలని చెప్పటం జరిగింది. ప్రతిసమస్య గురించి ప్రభుత్వం జోక్యం కలిగించుకోవటంవల్ల పరిస్థితి తీవ్రతరం అవుతున్నది. పరిస్థితి విషమిస్తున్నది. భూసంస్కరణల విషయంలో ప్రభుత్వం ఒక ఆర్డినెన్సును జారీ చేసింది. ఆ సమస్యను పరిష్కరించటానికి ప్రభుత్వం ప్రయత్నించటంతో అది విషమిస్తోంది. ఆ సమస్య మరింత తీవ్రతరమవుతోంది. అక్కడ ఒక రోగం ఉంది. ప్రభుత్వం చికిత్స ప్రారంభించటంతో ఆ రోగం ముదురుతోంది. ఆ రోగానికి ఇంకా ఏ పేరు పెట్టినప్పటికి, చికిత్స చేస్తున్నటువంటి వైద్యుడు మాత్రం అతడే. అందుచేత యీ సమస్యను సంపూర్ణంగా, సమగ్రంగా, నిర్వివాదంగా ప్రభుత్వం పరిష్కరించి, అన్ని ఇనాములు యీ చట్టంక్రిందకు వచ్చేటట్లుగా, రైతాంగానికి సంపూర్ణమైన హక్కులు సంక్రమించేటట్లుగా చేయటంద్వారా, ప్రభుత్వం భూసంస్కరణలు కూడా సక్రమంగా నిర్వర్తించ గలుగుతుంది అనేటటువంటి సంకల్పాన్ని, ధైర్యాన్ని ప్రజలకు కలుగజేస్తుందని ఆశిస్తూ సెలవు తీసుకొంటున్నాను.

శ్రీ యన్. వెంకయ్య: అధ్యక్షా, ఈ బిల్లును నేను సమర్థిస్తున్నాను. 1908వ సంవత్సరంనుంచి యీ సమస్య ఒక రూపాన పడకుండా అనేక విధాల తికమకలు పెడుతూ రైతులలో విపరీతమైన ఆందోళన కలిగిస్తున్నప్పటికీ ఆ సమస్యకు తుది రూపం ఇంతవరకు ఇవ్వబడనందుకు నేను ఎంతో విచారపడుతున్నాను. 1908 వ సంవత్సరపు యాక్టు ప్రకారంగా కొన్ని ఇనాము గ్రామాల్లో రైతులకు జిరాయితీ హక్కులు కలిగించబడ్డాయి. అగ్రామాల్ల రద్దు కూడా అయిపోయాయి. 1936వ సంవత్సరంలో, అన్ని అగ్రహారాలు ఎస్టేటులుగా మారుతాగు ఒక బిల్లు తీసుకురాబడి చట్టము అయినప్పటికీ, పదములలోని సందిగ్ధత వల్ల కొన్ని చిక్కులు ఏర్పడుతున్నవి. "పెరాల్" అనే మాటలో,—అది పూర్తి ఇనాము గ్రామము అవుతుందా కాదా అన్న విషయం మీద అనేక రకాలైన తీర్పులు రావటం జరిగింది. ఒక రోజు ఇనాము గ్రామము అయినది, ఆ మరుచటి రోజు ఇంకో తీర్పుతో ఇనాముగ్రామము కాకపోవటం జరుగుతున్నది. మైనర్ ఇనాములుగా ఉన్న (నౌకరి ఇనాములు) అగ్రహారము పూర్తి ఇనాము గ్రామము కాదని తీర్పు ఇస్తే, అది సవరించారు. శివార్లు, ఖండ్రికలు ఉన్నవి కూడా అగ్రహారాలే అవుతాయి. అందుకుకూడా సవరణలు వచ్చాయి. కాని, ఇంతవరకు రెండుసార్లు మూడుసార్లు అవి పూర్తిగా ఇనాము గ్రామమే అయినా, "ఇవ్వబడినవి అగ్రహారాలు కాదు" అని తీర్పులు వస్తే యీ రోజువరకు అవి ఇనాము గ్రామాలు కాకుండా ఉండిపోయిన స్థితిలో ఉన్నాయి. ఇప్పుడు తేబడిన సవరణ చట్టంతో కూడ, ఒక గ్రామం పూర్తిగా రెండు సార్లో, మూడుసార్లో ఇద్దరికో ముగ్గురికో గ్రాంటుగా ఇవ్వబడినా, మైనర్ ఇనాములు తప్ప, వేరే పట్టాభూములు లేకపోయినా అగ్రహారాలు కావని నిర్ణయించబడటం జరిగింది. అలాంటి కొన్ని గ్రామాల్లో శిస్తు తగ్గింపు చట్టం కూడా అమలులోనికి రావటం, ఆ చట్టం అమల్లోకివచ్చినా, అవి అగ్రహారాలుగా భావింపబడకుండా ఉండటం జరుగుతోంది.

ఇట్లాంటి గ్రామాలు కొన్ని వందలు ఉన్నప్పటికీ, అవన్నీ యీ చట్టం క్రిందకు రాకుండా ఉంటే యీ రద్దు చట్టం సమగ్రం కాదని ప్రజలు ఆందోళన పడుతున్నారు. "పూర్తి అగ్రహారం" అనే మాటకు "రెండు, మూడు సార్లు ఇవ్వబడినదైనా" అన్నది చేర్చబడితే చాలా గ్రామాలు ఇనాము గ్రామాలుగా పరిగణింపబడతాయి.

శ్రీ కె. వెంకటరావు: గౌరవ సభ్యులు కొన్ని సంవత్సరాల వెనుక ఉన్నారు. రెండు మూడు మాట్లు ఇచ్చింది కూడా ఇనాము గ్రామమే అన్న సవరణ ఇదివరకే జరిగింది. వాటిని కోర్టులు అంగీకరిస్తున్నాయి. అందుచేత ఇంకో విషయం చెప్పండి.

శ్రీ యస్. వెంకయ్య: ఇప్పటికీ, గుంటూరు నెల్లూరు జిల్లాల్లోని కొన్నిగ్రామాలలో యీ విషయంలో సుప్రీమ్ కోర్టువరకు వ్యవహారం చేయబడుతూ, ఇంకా సందిగ్ధంలోనే ఉన్నా యనేది మీకు స్పష్టంగా నిరూపణ చేయగలమని మనవి చేస్తున్నాను.

శ్రీ కె. వెంకటరావు: దానిక్రింద కాదండి. ఈ విషయంలో కోర్టుకు వెళ్ళితే అనుకూలంగా జరుగుతుంది. సభ్యులు పేరు చెప్పండి. ఈ సెక్షన్ క్రింద ఎందుచేత రాలేదో చెబుతాను. నేను చెప్పే విషయాలన్నీ ఊరికే వినుకోవద్దామనే దృష్టితో సభ్యులు మాట్లాడితే ఏం లాభం? నేనంత బేపూచీగా చెప్పటంలేదు. "రెండుమూడుమాట్లు గ్రాంటుఇచ్చినా కూడ అది ఇనాం గ్రామం అవుతుంది" అనేటటువంటి డెఫినిషన్ ఇప్పుడు ఉన్నటువంటి లా' లో ఉంటే, ఊరికే లేదని గట్టిగా చెప్పటంవల్ల లాభం లేదు. సభ్యులు కొంచెం తెలుసుకొని అర్థం చేసుకొని మాట్లాడటం న్యాయంగాని, ఊరికే లేదని చెప్పటంవల్ల అర్థం లేదు.

శ్రీ బి. శంకరయ్య: "రెండు మూడుమాట్లుగా గ్రాంటు ఇచ్చినా" అని కాదు. "రెండు మూడుమాట్లు రికగ్నైజ్ చేసినా; 2, 3 పర్సన్స్‌కు ఇచ్చినా" అని ఉంది. "రెండు మూడు మాట్లు ఇచ్చినా" అని లేదు. అందువల్ల 1956 యాక్టు ప్రకారంగా ఇనాము గ్రామాలన్నీ ఎస్టేట్లు అయ్యేదానికి అవకాశం లేదని చెబుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు: 1956 వ సం. యాక్టు ఇనాముల గురించి కాదు. కండ్రీ గలను గురించి చెబుతుంది. దాని definition వేరు. గౌ. సభ్యుడు ఒకదాని లో నుంచి యింకొక దానిలోకి తీసుకుని వెళ్ళితే ఎట్లా కుదురుతుంది? నేను రెవిన్యూ మంత్రిగా ఉన్నంతకాలము శంకరయ్యగారి doubts నేను తీర్చలేను. గౌ॥ సభ్యులలో ఎవరికైనా అనుమానాలు ఉంటే, అవి తీర్చటానికి నాలో ప్రత్యేకంగా చెప్పితే నేను వాటిని అన్నింటి తీర్చగలను. ఇక్కడ సభలో ఒక ముక్కచెప్పి తరువాతయింటికి వచ్చేటప్పటికి అది మార్చివేసి మాట్లాడితే, యింక నేను సమాధానము ఎట్లా చెప్పేది?

శ్రీ ఎస్. వెంకయ్య: కాని రెవిన్యూ మంత్రిగారు రెండు మూడుసార్లు, grant యివ్వబడినప్పటికినీ, అవి అగ్రహారమునానే పరిగణింపబడుతుందని అంటున్నారు. కాని అలాంటి మాత్రము మా దృష్టిలో కన్పించడము లేదు. కోర్టుల దృష్టిలో కన్పించడము లేదు. కొన్ని కోర్టుల తీర్పులు స్పష్టముగ చెప్పినవి ఉన్నవి. వాటిని మంత్రిగారి దృష్టికి తెస్తామకూడా.

శ్రీ కె. వెంకటరావు : నేను రెవిన్యూ మంత్రిగా ఉన్నానని గౌ. సభ్యునికి తెలుసు. పైగా ఆయన పార్టీ మెంబరు. బుక్కువున్నది. ఈ విషయమును గురించి చెబుతున్నాను, ఇక మీదట నా దృష్టికి తెస్తానని యిప్పుడు విమర్శలు చేయాలని చేస్తున్నారా ?

శ్రీ యస్. వెంకయ్య : రెవిన్యూ మంత్రి కళా వెంకటారావుగారు అన్ని విధములా విజ్ఞానులు, సమర్థులు. వారుఅన్నివిధముల రైతులకు హక్కులు సంక్రమింప జేస్తారని ఆశిస్తున్నాను, మంత్రిగారు తమయొక్క సర్వ విదితమైన విజ్ఞానములో అన్ని విధములైన అంశములు ఇమిడి ఉన్నవని తెలిసే ఉంటుంది. కాబట్టి అవి మంత్రిగారి దృష్టికి తీసుకుని రాకుండానే అవసరమైన సవరణలు చేస్తారని ఆశిస్తున్నాను. గతసారి యీ శాసనమునకు సంబంధించిన అంశములు వారి దృష్టికి తెచ్చాము. ఈ amendment చేయడము చాలా అవసరమని వారికి సూచించి యున్నాము కూడ. కాని ఆ సవరణలు యింతవరకు రాలేదు. కాని ఈ బిల్లు క్రిందకు రాకుండ తప్పి పోయిన ఇనాము గ్రామాలు అనేకము ఉన్నవనే మాట స్పష్టము. అవి యింతవరకు అగ్రహారాలుగానే ఉండి, అందులో పట్టాదార్లు, రైత్వారీ పట్టాదార్లు కూడా లేనటువంటి గ్రామాలు, అగ్రహారాలు జనాభా లెక్కలలో, రెవిన్యూ లెక్కలలో నమోదు చేయబడినవి. ఇంకను అనేక గ్రామాలు ప్రతి జిల్లాలోను మిగిలిపోయినవి ఉన్నవనే మాట స్పష్టము. అటువంటి వాటి విషయములో న్యాయముగ కలుగ జేయవలసిన హక్కులు అన్నీ సంక్రమింప జేసి ఇనాములు రద్దు చేయటానికి ప్రయత్నించిననాడే అందరు సంతోషించ గలుగుతారు. అలాంటి అవకాశమును రెవిన్యూ మంత్రిగారు కలుగ జేస్తారని ఆశిస్తున్నాను. ఇప్పటికే యీ సమస్య విషయములో విపరీతమైన ఆందోళనలు బయలు దేరినవి. ఇనాందార్లు, అగ్రహారందార్లు, రైతులు అందరు తమతమ హక్కులను కాపాడుకోటానికి కోర్టుల చుట్టూ తిరుగుతూ, ధనము వ్యయము చేసుకోవడము వల్ల, వాళ్ళకున్న ఆస్తులను కోల్పోవడము అనేక చోట్ల జరుగుతున్నది. వారిమధ్య తగాదాలు యింకను జరుగుతునే ఉన్నవి. కాబట్టి యిలాంటి విషమ సమస్యను త్వరలో పరిష్కరింప జేస్తే ప్రజలు చాలా సంతోషిస్తారు. కాబట్టి యీ విషయములో సమగ్రంగా ఆలోచించి యిరుపైపుల వారికి నష్టము లేకుండా, లాభము పొందే లాగు తగు సవరణ తీసుకుని వస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

* శ్రీ పి. రాజగోపాలనాయుడు : అధ్యక్షా, ఈ ఇనాము సమస్యను పరిష్కరించటానికి ప్రభుత్వము తరఫున చాలా హెచ్చుగా కృషి చేయబడింది. దీనిని ఎవరూ కాదనలేరు. ఈ ఇనాము సమస్య చాలా క్లిష్ట సమస్యగా ఏర్పడింది. ఇది ఎంత క్లిష్టముగ ఉన్నదంటే, అనుభవజ్ఞులు, సమర్థులు అయిన మన రెవిన్యూమంత్రి కళా వెంకటారావుగారికే మించి పోయింది. ఎందువల్లనంటే, వారు యీ సమస్య విషయములో యిప్పటికి ఎన్నో సంవత్సరములుగా ఎంతో ఆలోచించి, వారి శక్తి సామర్థ్యములు ఉపయోగించి యీనాడు యీ బిల్లును తీసుకుని వచ్చి నప్పటికీనీ, యింకను ఎన్నో గ్రామములు తప్పించుకుని పోతూనే ఉన్నవి. ఈ విషయములో ప్రభుత్వముయొక్క దృష్టి ఏ విధముగ ఉన్నదంటే, సాధ్యమైనంతవరకు ఈ ఇనాము సమస్యను పరిష్కరింప చేయాలనే ఉద్దేశించుచున్నప్పటికినీ, దురదృష్టవశాత్తు యీసమస్య యింకను

పరిష్కారము కాకుండ పోయే పరిస్థితులు కనబడుతున్నవి. ఇందులో ఉదహరించిన పద జాలములో ఏదో లోటుఉన్నదని అందరూ అంగీకరిస్తున్నారు. ఈపద నిర్వచనములో లోటు రావడమువల్ల జరుగుతున్న ఫలితము ఏమిటంటే, దీనికి సంబంధించిన వ్యవహారములు హెచ్చు కావడము అవుతున్నది. అవి హెచ్చు కావడమువల్ల రైతులకే కాకుండ ఇనాముదార్లకు కూడ చాలా కష్టములు ఏర్పడినవి. ఈవిషయము అందరికీ తెలిసినదే. ఇప్పుడు యింక మీదట అయినను యీ వ్యవహారములు యింకనుహెచ్చు కాకుండా తగ్గించవలసిన అవసరము ఏర్పడు తున్నది. బిల్లులో ఉదహరించబడిన పద నిర్వచనము చూస్తే యిప్పటికి దీనివల్ల మూడు నాలుగుసార్లు పొరబాటు పడడము జరిగింది. ప్రభుత్వములో ఎవరు రెవిన్యూ మంత్రిగా ఉన్నప్ప టికినీ, యిందులో ఏదో ఒక లోటు కన్పిస్తూనే ఉన్నది. ఈ లోటు ఎక్కడ వస్తున్నదంటే ఈ చట్టము యొక్క స్వరూపములో ప్రయోగించబడినటువంటి పద జాలములోనే లోటు వస్తున్నది. అది తెలుసుకో గలిగినప్పుడు, ప్రభుత్వము దానితో నిమిత్తము లేకుండ మరొక న్యాయమార్గము ఆలోచించి, యీ సమస్యను పూర్తి పరిష్కారము చేయాలనే ఆలోచన ప్రభుత్వానికి కలుగక మానదు. కాబట్టి ఏదో ఒక న్యాయమార్గము ఉభయ పార్టీలకు అవసరమున్నది. దీనికి నేను ఒక సూచన చేయదలచాను. ప్రభుత్వమే ఈ ఇనాము గ్రామముల జాబితా ఒకటి తయారు చేసి ప్రకటించినట్లైతే పద జాలముతో నిమిత్తము లేకుండ అన్ని ఇనాము గ్రామాలు, అగ్ర హారాలు, కండ్రిగలు వగైరాలు అన్నీ ఒకేసారి రద్దు అయిపోయి అన్నీగూడ Estates గా declare చేస్తే, యీ గ్రామాలు అన్నీ రద్దు అయిపోయే అవకాశము ఏర్పడుతుంది. ఇంతటితో యీ ఇనాము సమస్య పూర్తిగా పరిష్కారము అయిపోయినట్లవుతుందని నా అభి ప్రాయము. మంత్రిగారు యిలాంటి ఆలోచన పరిశీలించి ఆ మార్గమును అవలంబిస్తారని కోరుతున్నాను.

[Mr. Speaker in the Chair]

శ్రీ. ఎలమందారెడ్డి :—అధ్యక్షా, ఇనాము సమస్యను గురించి చర్చ జరిగే సందర్భములో ముఖ్యంగా సభ్యులు తమ తమ ప్రాంతాలలో తమకు తెలిసిన అనుభవములను దృష్టిలో పెట్టుకుని, మాట్లాడుతున్నారనే సంగతి రెవిన్యూమంత్రి కళా వెంకట్రావుగారు గుర్తిస్తారని అనుకుంటాను. కాని వారు చట్టము అని చెప్పి యిందులో వున్న అసలు సమస్యను బైటికి రాకుండా చూస్తున్నారని నేను మీకు మనవి చేస్తున్నాను. ఎందువల్ల నంటే, యీ రోజున ఈ ఇనాము చట్టము అనేది, చాల ముఖ్యమైనది. చట్టనిర్మాణ మేధస్సుకు, లేక న్యాయ విచారణ మేధస్సుకు ఒక చిహ్నముగ మిగులుతుందేమో గాని, అసలు సమస్య యింతవరకు కూడ సమగ్రముగ పరిష్కారము కాలేదని మనవి చేస్తున్నాను. కారణములు ఏమిటంటే, దీనిని గురించి ఎన్ని చట్టములు చేసినను, దీనిపై వెంటనే కోర్టులలో భాష్యాలు రావడము, దానికి మరల సవరణలు చేయడము యీవిధముగా యెన్నోసవరణలు చేయడము చూస్తే, యిదిఒక చిక్కు సమస్యగాను, ఎడతెగనిదిగాను వస్తున్నది. ఇది మనకందరికీ తెలిసిన విషయమే. ఈ చట్టమును చూస్తే, ఇందులో clauses, sub-clauses చేర్చడము తప్ప, అసలు యీనాడు దేశములో ఉండే ఇనాము సమస్య పరిష్కారము చేయడానికి దీనిని గురించి ఏమి మాట్లాడా తున్నారు, దీనియొక్క అర్థము ఏమిటి అనేది తెలుసుకోడానికి ప్రయత్నిస్తే చాలా బాగుంటుంది.

ఈనాడు ప్రతి పక్షమునుంచి మాట్లాడే విషయము మంత్రిగారిగాని మంత్రివర్గముగాని గుర్తించకుండ మంత్రిగారు ఇందులో ఎన్ని విధములుగా కుదించి వ్రాసినప్పటికినీ, దీనిలో కప్పిపుచ్చిన విషయము ప్రతి పక్షమునకు తెలియక పోలేదు. ఇందులో వున్న విషయము ఏమిటో చెబుతున్నాను. ఈనాడు మంత్రిగారు తీసుకుని వచ్చిన చట్టము చూస్తే 1936వ సంవత్సరము తరువాత వచ్చిన ఇనాము estates కాని, లేకపోతే మనము ప్యాసు చేసిన 1956 సం. పు Inam estate విషయముగాని, వాటిని రద్దు చేయాలనే దానికి ఎవ్వరికినీ ఆక్షేపణలేదు. ఇదీ హర్షించ దగిన విషయమే. అయితే estate అనేది నిర్వచించినపుడు యీ చట్టము తెచ్చిన సందర్భములో మనము ఏరకంగా ఎక్కడనుంచి ప్రారంభించి, ఎక్కడకు చేరాము, యీ సమస్య ప్రభుత్వము సక్రమంగా పరిష్కారము చేస్తుందా, లేదా అనేది చర్చనీయాంశము. అందువల్ల ఆ రకంగా చూచుకున్నప్పుడు 1936 వ సం. తరువాత ఫలానా ఇనాము ఎస్టేటా, కంద్రిగా, లేకపోతే సివారా, గ్రామమా అని యీ రకంగా చెప్పుకుని పోతూ, మనము ఎక్కడకు చేరాము అని విచారించేట్లైతే ఒక రకంగా జమీందారీ రద్దు చట్టములో ఇంతవరకు రైతాంగానికి కళా వెంకటరావుగారు చేసిన మేలు గుండు సున్నగా తయారైంది అని చెప్పటానికి నేను విచారిస్తున్నాను. ఎందుకంటే 1956 వ సం. లో వచ్చిన ప్రెసిడెంట్ యాక్టు ప్రకారము "substantial portion" అని వచ్చినప్పుడు కొంతవరకు దేశములో ఉన్న ఇనాము సమస్య పరిష్కరించటానికి అవకాశము ఏర్పడింది. దానిద్వారా దేశములోని ప్రజానీకము, ముఖ్యంగా ఇనాము రైతులు కొంతవరకు సంతోషించారు. దానిని మెరుగు పెట్టటానికి ఆంధ్రరాష్ట్రములో ఏర్పాటు చేయబడిన Select Committee వారు తర్జన భర్జనలు జరిపి, Legal Department వారు అందరు కూడ తీవ్రమైన విచారణ చేసి, అన్నీ కూడా సక్రమముగ అమలు జరిపే విధముగా, ఇనాము సమస్య సంతృప్తి కరముగ పరిష్కరింపబడే విధంగా నిర్వచనము ఒకటి తయారు చేసి Inam estate అంటే ఏమిటో నిర్వచించారు. ఈ విధముగ అభివృద్ధి జరిపితే దేశములో చట్టము అమలు జరగటానికి వీలు అయిన నిర్వచనములు అన్నికూడ యీ రోజున చూస్తే ప్రభుత్వము ప్రవేశ పెట్టిన సవరణ వలన ప్రెసిడెంటు యాక్టులో ఉన్న నిర్వచనము కూడ పోయింది. తరువాత Select Committee వారు ఏకగ్రీవముగ ప్యాసు చేసిన నిర్వచనము కూడ తుంగలో కలసి పోయింది. ఈ నాడు కళా వెంకటరావుగారు తయారు చేసిన నిర్వచనము మరల మొదటికే వచ్చింది. మా . పార్టీ విధానము శ్రీ శంకరయ్యగారు వివరంగా చెప్పారు ఇక్కడ మాపార్టీ, వారి పార్టీ అనే విషయము లేదు. ఇదీ దేశములో ప్రస్తుతము ఇనాము రైతాంగానికి సంబంధించిన సమస్య. Select Committee లో ఉన్నవారు, అందులో కాంగ్రెసు సభ్యులు అయి నటువంటివారు [Interruption]

శ్రీ కె. వెంకటరావు :—It is only misstatement of facts, Sir.

ఈరోజున తెచ్చిన యీ బిల్లులో ఎక్కడను కూడ Inam అనే దానికి నిర్వచనమును గురించిన సెక్షను లేనేలేదు. దీనిని గురించి నేను ఈ రోజున కొత్తగా ఒక amendment తీసుకుని వచ్చాను అని ఆరోపణ చేస్తే, యింక నేను ఏమి చెప్పేది!

శ్రీ జి. యలమందారెడ్డి :—అధ్యక్షా, ఇందాక నేను మీకు మనవి చేసినట్లుగా ఏ విషయమును గురించి మాట్లాడినను, దానికి legal aspect అడ్డము తెస్తున్నారని చెప్పాను. అది పూర్తిగ అర్థము చేసుకునే మాట్లాడుతున్నాను. Inam estate అనే దానికి నిర్వచనము క్రింద ఏవేవి estate క్రిందకు రావాలో ఆ సందర్భమును నేను మనవి చేస్తున్నాను.

*Sri K. Venkata Rao :* On a point of personal explanation, Sir. It is a mis-statement of fact. ఇవ్వాళ ఈ బిల్లులో ఎక్కడా drafting about section 4 తరువాత ఇనాం యొక్క నిర్వచనాన్ని గురించి సెక్షనులేదు. నేను దానిని గురించి ఇవ్వాళ క్రొత్తగా legal aspect పెట్టానని ఆయన ఆరోపణ చేస్తే నేను ఏమి చెప్పవలసి ఉంటుంది ?

శ్రీ జి. యలమందారెడ్డి : దానికి నేను ఇందాక తమతో మనవిచేసినట్లుగా ఏ విషయం మాట్లాడినా estates ను ఒరిలోకి లాగవద్దని చెప్పాను. అది పూర్తిగా చైతన్యయుతంగా తెలిసికొనే మాట్లాడు తున్నాను. ఇనాం ఎస్టేటు అనే నిర్వచనంలో ఏ ఎస్టేట్లు రావలసినవనే సందర్భంలో ఏవిరాలేదో, ఏవిరావాలో మీకు మనవి చేస్తున్నాను. మంత్రిగారు తప్పు పెట్టారని నా ఉద్దేశ్యముకాదు. వారు ఎంతవరకు పెట్టారో ఆ విషయం మాకు తెలుసును. మీరు అనుకునేది ఒకటి, చేసేది ఒకటి అని మేము అనుకోవడంలేదు. వారి ప్రభుత్వం సక్రమంగా చేయడానికి ఉద్దేశించ బడలేదని, తదనుగుణంగా ఈనాడు ఈ amendment తెస్తున్నారనే విషయం మాకు తెలుసును. ఆ విషయమే ఉదాహరణకు మనవి చేస్తున్నాను. అందువల్ల చట్ట వ్యవహారంలో తేడా ఏమీలేదు. వారు చెప్పేది ఏమిటో మేము చెప్పేది ఏమిటో అందరికీ బాగా తెలుసును. అదికాదిక్కడి సమస్య. ఈనాడు మనం చేసే చట్టంద్వారా మొట్టమొదట మంత్రిగారు తెలిపినట్లుగా ఈ రోజుతో ఇనాం సమస్య పరిష్కారం అవుతుందని చెప్పిన విషయంలో దానికి సంబంధించి ఆరకంగా పరిష్కారం అవుతుందా కాదా అని చూచినప్పుడు పరిష్కారము కావటములేదు. ప్రెసిడెంటు యాక్టు ప్రకారం కానివ్వండి తరువాత మన సెలెక్టు కమిటీ ఏకగ్రీవంగా చేసిన నిర్వచన ప్రకారం కానివ్వండి కలిగిన సౌకర్యము లన్నీ విలువలేకుండా పోయాయి.. ఈనాడు ఇనాం రైతాంగం అనేక వేల మందిని, భూములనుండి వెళ్లగొట్టే సందర్భంలో మనవి చేస్తున్నాను. ఇదే సందర్భంలో ఇంకోవిషయం చెప్పవలసివుంది. ఈనాడు భూసంస్కరణలు తెస్తున్నారు. భూసంస్కరణలంటే దేశంలో దున్నే రైతాంగానికి భూమి ఇవ్వాలని, కొంతమేరకు ceiling పెట్టాలని ఆరకంగా ఆర్డినెన్సు మన రివిన్యూ మంత్రిగారు గవర్నరుగారి ద్వారా జారీచేయించారు. మంచిదే. ఆ సంగతి తీసుకున్నప్పుడు ఈ రోజు దేశంలో ఇనాంకు సంబంధించి అనేక గ్రామాలు మన ఇనాం ఎస్టేటు నిర్వచనంలోకి రావడంలేదని రైతాంగం eviction జరుగుతుందని చెప్పినప్పుడు,...........

శ్రీ కె. సుబ్బారావు : భూసంస్కరణలు ఇనాములకు సంబంధించినవేనా ?

***Mr. Speaker :*** **Kindly sit down, దానికి relevant గానే అవాళ్ళుంవుంది.**

శ్రీ జి. యలమందారెడ్డి: అది మంత్రిగారే సెలవిచ్చారు. అందువల్ల ఈరోజు అనేక గ్రామాలు రావడంలేదని అడిగినప్పుడు మంత్రిగారేమి సమాధానం చెప్పారంటే "భూసంస్కరణలు వచ్చినప్పుడు దీని సంగతి చూసుకుందాములే, అప్పుడు దీంట్లోకి వారూ వస్తారు" అని. ఎప్పుడో భూసంస్కరణలువచ్చి ఏమో జరిగేముందుగా ఈ రోజు గ్రామంలో ఈ ఇనాం ఎస్టేటు నిర్వచనం క్రిందకి రాకుండా కొన్నివేల రైతాంగం ఇప్పటికప్పుడే eviction చేయబడుతున్నారు. ఈరకంగా evictions జరిగిన తరువాత ఎప్పుడో వారికి భూసంస్కరణలు చట్టం అమలు జరుపుతాం అనడం ఏమాత్రం సమంజసము కాదని నేను మనవి చేస్తున్నాను. ప్లానింగు కమీషనువారుగాని, కేంద్ర ప్రభుత్వంవారుగాని ఎవరు చెప్పినప్పటికీ కూడా దేశంలో evictions ఆపాలనే. ఆ సమస్యను అట్లా ఆపి తరువాత భూసంస్కరణలు వచ్చినప్పుడు కూడా మూడు నాలుగు సంవత్సరాలు వెనుకకు వెళ్లి review చేయాలని ఆలోచించే సందర్భంలో ఈనాడు రైతులందరూ eviction అయినా ఫరవాలేదనడం, తరువాత మనం ఎప్పుడో చట్టం తెచ్చుకుందాం అని ఆలోచించడం ఏమాత్రమూ సబబుకాదని మనవి చేస్తున్నాను. అందువలన ఇంతవరకు రద్దుకానివ్వడానికి ఎలాంటి ఆక్షేపణలేదు. ఈ బిల్లు యొక్క purview లోకి రాకుండా దేశంలో అనేక ప్రాంతాలలో నిలబడిపోయిన విషయాలన్నీ కూడా తప్పకుండా సభవారు ఆలోచించాలని మనవి చేస్తున్నాను. ఇదే సందర్భంలో ఇంకోవిషయం మనవి చేయక తప్పదు. మంత్రిగారు ఎప్పుడు చెప్పినా చట్టాలను కాగితంమీద చూపిస్తారు. కాని అవి ఎంతవరకు అమలు జరిగాయో చెప్పడానికి ఏమాత్రం ప్రయత్నం చేయరు. 1956 వ సంవత్సరపు చట్టం ప్రకారం ఇనాం గ్రామంగా రిజిష్టరులో నమోదయిన గ్రామాలలో ⅓ ఇనాందారుకు 2/3 రైతుకు అని చట్టం చేశాము. అది ఏరకంగా అమలు జరుగుతున్నది? ఏరకంగా అమలు జరగడం లేదనే విషయాన్ని మంత్రిగారి దృష్టికి అనేక సందర్భాలలో తీసుకువచ్చాము. ఈరోజు Tenancy Act ప్రకారం వీరందరూ trespass చేస్తున్నారు అని కొన్ని సంవత్సరాలనుండి అనుభవించే రైతాంగాన్ని trespassers గా ఉన్నారని కోర్టులు తీర్పులు చెబుతూ రైతాంగాన్ని భూములనుండి వెళ్ళగొడుతూవుంటే, చేసిన చట్టం అమలు జరగకుండావుంటే వారు చూసి కూడా ఉదాసీనత వహిస్తున్నారని చెప్పక తప్పదు. నెల్లూరు జిల్లాలోని పరిస్థితులు గురించి శ్రీ శంకరయ్యగారు అనేక ఉదాహరణలు చెప్పారు.

మిస్టర్ స్పీకర్:—అవన్నీ ఈ బిల్లుకు సంబంధించినవేనా?

శ్రీ జి. యలమందారెడ్డి:—అధ్యక్షా, దీనికి సంబంధించినవే. ఎప్పుడో భూసంస్కరణలు తెస్తాం, చూస్తాం, అని మంత్రిగారు శాసన సభలో ఎంత ఉదారంగా వాగ్దానం చేస్తారో అంత ఉదారంగా అమలు జరపడం లేదని నేను మీకు చెప్పక తప్పదు. ఈరోజు ఈ బిల్లు ప్యాసుచేసిన సందర్భంలో దీని క్రిందికి రాకుండా ఉన్నటువంటి వాటిని దీని క్రిందికి తీసుకువచ్చే ప్రయత్నం చేయాలి. భూసంస్కరణలు వచ్చేలోగా లక్షలాది రైతాంగం evict కాకుండా చూడాలి. వారికి భూమిమీద హక్కు భుక్తం కలిగించాలి. ఉత్పత్తి జాస్తికావలెనే దృష్టితో ఆలోచించి ఇప్పుడు ఈ సెక్షన్ల క్రిందికి రాకుండా మిగిలిపోయిన విషయాలన్నీ కూడా [illegible]

ప్రకారం, మన సెలెక్టు కమిటీవారు ఇదివరకే ఏకగ్రీవంగా చేసిన తీర్మానం ప్రకారం నిర్వచనం, ఇచ్చుకుని ఆరకంగా చేసినట్లయితే చాలా సక్రమంగా ఉంటుంది. ఈ విషయాలను అనేకమంది మిత్రులు వివరించారు. అందువల్ల సభ్యులు ఇక్కడ ఆవేదనతో నివేదించిన విషయాలు తమతమ ప్రాంతాలలో యాక్టు అమలు జరుగక రైతాంగం evict కాబడిన వారికున్న ఇబ్బందులను ప్రభుత్వం సానుభూతితో ఆలోచించాల్సిన అవసరంవుంది. అందువల్ల ఈ చట్టంలోకి మిగిలిపోయిన అనేక ఇనాం ప్రాంతాలను తప్పకుండా తీసుకువచ్చినప్పుడే మనం భూసంస్కరణలన్నా ఇంకేమన్నా అర్థం ఉంటుంది. కాని ఎక్కడికక్కడ పంపకాలు జరిగి బినామీ transactions జరిగిన తరువాత కేవలం ఇనాం యాక్టు ప్రకారమే రేపు భూసంస్కరణలు చేసినందువల్ల ప్రయోజనం లేదు. కాబట్టి ఈనాడు దీని క్రింద వెంటనే తీసుకురావలసినదనీ ఆ రకంగా ప్రభుత్వం చూడాలనీ మన సెలెక్టు కమిటీవారు ఆమోదించిన నిర్వచనాన్ని తప్పకుండా దీంట్లో చేర్చడానికి ప్రయత్నం చేయాలనీ మనవిచేస్తున్నాను. అయితే మంత్రి శ్రీ వెంకటరావుగారు ఇంకో విషయం చెప్పారు. 'అదెక్కడ నేను పెట్టానయ్యా' అని. పెట్టకపోవచ్చును. అది పెట్టాలని నేను కోరుతున్నాను. పెట్టడంవల్ల ఇబ్బందిలేదు. ఎందువల్లనంటే హైకోర్టు జడ్జిమెంటు ప్రకారం "such as" కు వచ్చిన ఇబ్బందిని తొలగించడానికి ఇనాం ఎస్టేటు నిర్వచనం రేపు రాబోయే బిల్లుకు ముందుగానే ఈ Abolition Actలో మనం చేర్చుకుంటున్నాం అదేరకంగా ఈరోజు Abolition Act క్రింద ఏవైతే ఇనాం ఎస్టేట్లు క్రిందికి వస్తాయో నిర్వచనాన్ని చేర్చుకున్న తరువాత అవసరమైతే రేపు ఆ చట్టంలో ఆ సవరణలు చేసుకోవచ్చు. అందువల్ల ఒకదానికొకటి పరస్పర వైరుధ్యంలేదు. అది కేవలం convenience మాత్రమే. నిర్వచనానికి సంబంధించి చేసుకున్నప్పుడు ఏవేవి రద్దుకావాలో తప్పకుండా automatic గా వస్తాయి కాబట్టి ఆరకంగా ఇవన్నీ జతచేర్చి చేసినప్పుడే సమన్వయంగా ఉంటుంది లేకపోతే ఏమాత్రమూ అర్థం ఉండదు. ఇంతవరకు శాసన సభలో చర్చించిన సారాంశము చేసిన తీర్మానము సక్రమంగా అమలు జరుగవని మీద్వారా మనవి చేస్తున్నాను.

*శ్రీ కె. వెంకటరావు :—అధ్యక్షా, ఈ బిల్లు ఇంత చర్చకు కారణం అవుతుందని నేను అనుకోలేదు. ఎందుచేత నంటే యిదివరకు గౌరవ సభ్యులు అప్పుడప్పుడు సభలో సూచన లిచ్చారు "మీరు ఇవ్వాళ బిల్లు ఎందుకు పెట్టలేదు. మీకు వ్యవధి లేక పోతే గంటలోనే ఈ రెండో బిల్లులు ప్యాసు చేసేద్దాము" అని కూడా సభా ప్రాంగణంలోనే చెప్పారు. తీరా బిల్లు వచ్చేటప్పటికి రెండు గంటలు పరిపోలేదు. నాలుగు గంటలు కూడా సరి పోవడం లేదు. కాని ఒకందుకు సంతోషం. ఇటువంటి సమస్య ఒకటి దేశంలో వుందనీ, ఈ సమస్య యొక్క పరిష్కారానికి అనేక చోట్ల వచ్చే కష్టాలన్నిటిని క్రోడీకరించుకుని మనం చర్చించుకుని దీనికి పరిహారం తీసుకురావాలి అనే భావం కలగడం మాత్రం చాలా సంతోషించ వలసిన విషయం. అందువల్లనే యివ్వాళ పదకొండు మంది గౌరవ సభ్యులు యీ విషయమై మాట్లాడడం ఆహ్లాదకరమైన విషయం. నేను మొదటి నుంచి, మధ్యలో వచ్చిన వాద ప్రతివాదాలలో సుస్పష్టం చేసిన చాలా విషయాలు మళ్ళీ తిరిగి అంత విపులంగా ఉద్ఘాటించవలసిన అవసరం లేదనుకుంటాను.

దేశంలో చట్టాలు చేసేటటువంటి అధికారం శాసనసభలకుంది. శాసనసభలు చట్టాలు చేసిన తరువాత వాటిని విచారించి దేశంలో వున్నటువంటి పౌరులందరికీ అందజేయవలసిన బాధ్యత కోర్టుల కున్నది. ఇటువంటి రాజ్యాంగాన్ని మనం అంగీకరించి యీ సభలో సభ్యుల క్రింద వున్నాం. మనకు అవసరం వచ్చినప్పుడు కోర్టును తీసి అవతల పెట్టి మనకు అవసరం లేనప్పుడు కోర్టును తీసి లోపల పెట్టుకొనేటటువంటి పద్ధతి మీద రాజ్యాంగాన్ని అమలు జరపడం ప్రజాస్వామిక పద్ధతికి చాలా కష్టమైన విషయం. అందువల్ల "ప్రతీ దానికీ కోర్టు జడ్జిమెంటు చెప్పింది, కోర్టుకు వెళ్ళవలసి వస్తుంది, అందుచేత నాకు పౌరుడు క్రింద కష్టం అయిపోతుంది" అనే టటువంటి వాదన సమంజసమైనదీ కాదు. మనం ఇక్కడ శాసనసభలో తీసుకున్నటువంటి ప్రమాణం భంగం చేసినట్లు అవుతుంది గాని యింకో రకంగా కాదు. ఎప్పటికయినా, పౌరుడయినా, ఆస్తిని గురించి గాని స్వాతంత్ర్యము గురించిగాని, వాక్స్వాతంత్ర్యము గురించి గాని సంఘాన్ని గురించిగాని రాజ్యాంగ చట్టం 14వ సెక్షను మొదలు 31 వ సెక్షను దాకా రాజ్యాంగం మన కిచ్చినటువంటి హక్కు చెలాయించే టటువంటి forum కోర్టు తప్ప ఇంకొకటి లేదు. కోర్టును పూర్తిగా తొలగించడానికి వీలులేదు. అక్కడికీ యీ రోజు శాసనాలలో సివిలు కోర్టు jurisdiction ను తప్పించి త్వరగా బీద ప్రజలకు న్యాయం కలుగ జేసేటటువంటి శాసనాలున్నాయి. ముఖ్యంగా భూ సంస్కరణల శాసనంలో చాల వరకు సివిల్ కోర్టు దగ్గర కొన్ని చోట్ల స్పెషలు ట్రిబ్యునల్సుదగ్గర అప్పచెప్పి పైగా There is no appeal to any Civil Court అనే టటువంటి భావాన్ని కూడా కలుగజేసి ఎక్కువగా ఖర్చు తగ్గించి త్వరగా వ్యవహారం చేయడం కోసమనే అసలు scheme of legislation అంతా ఈ రోజులలో ఉన్నంతలో కూడా ఎవరో తప్పు జడ్జిమెంటు చెప్పి లక్షలాది, కోట్లాది, అర్బుదాలాది ప్రజలకు అన్యాయము చేస్తారా ? అనేటటువంటి శబ్ద ప్రయోగములు ఎరిగినటువంటి పెద్దలు కూడా మనవి చేస్తుంటే నాకు ఆశ్చర్యము కలుగుతుంది. నేను ఇవ్వాళ ఘంటాపథంగా చెప్పగలను. ఆంధ్ర దేశంలో 65 లక్షల ఇనాం రైతులు లేరు. ఆకాశంలో నక్షత్రాలుండాలి గాని భూమి మీద వ్యవసాయం చేసేటటువంటి రైతులు ఇంతమంది లేరు. ఇన్ని లక్షల ఎకరాలు భూ స్వామ్యంలో యినాం క్రింద లేదు. ఇది పరిమితమైన వ్యవహారం. దేశంలో ఎక్కువవి రైత్వారీ గ్రామాలు. తరువాత వున్నటువంటివి జమీందారీ గ్రామాలు. జమీందారీలు పోయాయి. రైత్వారీ గ్రామాలు అదివరకే వున్నాయి. ఈ రెండింటిని సమన్వయం చేశాము. ఇనాం గ్రామాలు కూడా వాటితో సమన్వయం చేశాము. ఇంక ఒక భాగాన్ని మాత్రం abolish చేసి దానిని కూడా common tenure లో తీసుకు రావడం అనే సంకల్పం తో చేసిన బిల్లు మొట్టమొదట నుంచి అంతా cover చేసి నక్షత్రాలని ఆకాశాన్నీ వీటన్నిటి అంకెలు చెప్పి.............

శ్రీ బి. శంకరయ్య :—అధికారయుతంగా లెక్కతీసి చెప్పండి.

శ్రీ కె. వెంకటరావు :—శంకరయ్యగారు చెప్పిన దానిలో 10 వ వంతు ఉంటారు.

శ్రీ బి. శంకరయ్య : అధికారికంగా లెక్కలు తీసి చెప్పండి.

శ్రీ కె. వెంకటరావు : శ్రీ కృష్ణ దేవరాయలు వారు తిమ్మరుసుగారిని అడిగారు—ఆకాశం మీద ఎన్ని నక్షత్రాలున్నాయి అని. తిమ్మరుసుగారు ఎల్లుండికి చెబుతాను అన్నారట. సరే, ఎల్లుండి వచ్చింది తిమ్మరుసుగారు వస్త్రంలో ఇంత ఇసుకపోసి, ఒక్కొక్క నక్షత్రం లెక్కవేసుకుంటూ ఒక్కొక్క ఇసుక రేణువు ఇందులో వేశాను ; ఈ ఇసుకలో ఎన్ని ఇసుక రేణువులున్నాయో అన్ని నక్షత్రాలు న్నాయని చెప్పారట. అట్లా ఉంది వారు అడిగేది. దేశంలో ఉన్న హక్కులన్నింటిని రికార్డు చేయాలంటే కొంతకాలం పడుతుంది, హైదరాబాదులో క్రాన్రాపాణి పత్రిక అని ఒకటి ఉన్నది. అందులో ఎవరికి భూమి ఉన్నదో, ఎవరు వ్యవసాయం చేస్తున్నారో, ఎంత పండిస్తున్నారో అనే లెక్క ఉన్నది. ఒక మారు వెళ్ళి లెక్కలు చూడండి. ఈ లెక్కలు కూడా ఆ రకంగానే ఉంటాయి, కొన్ని లెక్క పెట్టడానికి వీలున్నవి ఉన్నాయి ; కొన్ని లెక్క పెట్టడానికి వీలులేనివి ఉన్నాయి. 1951 వ సంవత్సరపు లెక్కలను బట్టి ఈ రోజున 35 కోట్ల 60 లక్షల జనాభా ఉన్నదని చెబుతున్నాము. 1957 వ సంవత్సరంలో ఎంత ఉన్నదీ అని అడిగితే ఏమి చెప్పను ? అది 1961 లో తెలుస్తుంది. అంతా ఒక పద్ధతిమీద నడుస్తుంది. ఊరికే ఎంత మంది ఉన్నారని అడిగినందువల్ల సమస్యకు ఎక్కువ ప్రాధాన్యం రాదు. ఉన్నవి ఎన్ని గ్రామాలు ? 1061 అని ఒక ఉజ్జాయింపు అంకె ఇచ్చాము. 1061 గ్రామాలలోను 65 లక్షలమంది రైతులు ఉంటారా ?

శ్రీ బి. శంకరయ్య : మీరు చెప్పిన 1061 ఎస్టేట్లు ; ఇనాం గ్రామాలు కావు.

శ్రీ కె. వెంకటరావు : ఇనాము గ్రామాలే. ఈ రాష్ట్రంలో ఉండే ప్రతి ఇనాం గ్రామం ఎస్టేటు అయి తీరుతుంది నా సవరణ వల్ల. సభ్యులకు మరో అభిప్రాయం ఉంటే వేరేసవరణపెట్టుకోవచ్చు సభ్యులు అనుకున్నవి ఇనాం గ్రామాలు కావు. వీటికి ఎప్పుడూ పట్టా పుట్టలేదు, ఎప్పుడూ దానికి గ్రాంటు లేదు, ఇపుడు ఇచ్చిన నిర్వచనం ప్రకారం ఇనాం గ్రామమైతే ఉంటే పైకి తోసి పెట్టడానికి మరొక కారణం ఏదైనా ఉండాలి కాని మరొక ఉద్దేశం ప్రభుత్వానికి లేదు ఈ రోజువరకు తీసుకువచ్చిన సంస్కరణలలో అటువంటి భావమే లేదు. 'వెంకటరావుగారి బుద్ధి కుశలత' అన్నారు. వెంకటరావు బుద్ధి కుశలత అందరికన్న తక్కువే కాని ఎక్కువ కాదు. ఇంతమంది ఉద్యోగస్థులు, మేమూ కూర్చుని, క్రిందామీదా పడి ఎక్కడ ఉన్నదానినైనా ఈ నిర్వచనం క్రిందకు తేవాలనే ప్రయత్నం చేశాము. లో ఎక్కడ ఇనాం అన్యాయం జరిగితే అప్పీలుకు తీసుకువెళ్ళడానికి నిన్న ప్యాసు చేసిన బిల్లు క్రింద అధికారం ఉన్నది. ట్రిబ్యునల్ డిస్మిస్ చేసిన అప్పీలుపైనా పైకి తీసుకురావచ్చును. నాకు చెప్పండి—ఫలానా గ్రామానికి సంబంధించి, అని ఈ నిర్వచనానికి లోబడి ఉన్నప్పటికీ, రైతులు పోరాడలేకనో సరిఅయిన రికార్డులేకనో అన్యాయం జరిగింది Person అనే మాట క్రింద ప్రభుత్వం అప్పీలు చేయడానికి వీలు లేకపోయింది. అటువంటి నిరూపణ చేస్తే గవర్నమెంటు యొక్క సర్వశక్తులు సామర్థ్యం ఉపయోగించి వాటిని ఇనాం ఎస్టేటు **Definition** క్రిందకు తెచ్చే ప్రయత్నం ప్రభుత్వం చేస్తుందని హామీ మనవి చేస్తున్నాను. ఇంత కంటే ప్రభుత్వం తరఫున ఏమి హామీ ఇవ్వగలను యల్లమందారెడ్డిగారు చెప్పినట్లు individual cases చెప్పవచ్చును. దానికి forum ఉండాలి ; అసెంబ్లీ కాదు, వారు

చదివిన పేర్లు కొన్ని నేను వేసుకున్న 1061 లిస్టులో ఉన్నాయి. శ్రీరామమూర్తిగారు చెప్పిన సీతారాంపురం నా 1061 గ్రామాల లిస్టులో ఉన్నది. లిస్టునువారు చూడలేదు. శంకరయ్యగారు చూశారు. కొన్ని ఉన్నాయి. కొన్ని లేవు. శాసనం ప్రకారం తరువాత చూడాలి కాని లిస్టు చదివి గవర్నమెంటు చేసేదంతా ఇనాందారుల కోసం అది చేయలేదు ఇది చేయలేదనే picture ప్రపంచానికి present చేయవలసిన ఆవశ్యకత లేదు. ఈ శాసనంలో వ్యవహారాలను ఒదుపు పెట్టుకునే యత్నం జరిగిందని, ఇంకా మిగిలిపోతే ప్రభుత్వం ప్రతిక్రియ తీసుకుంటుంది అని గట్టిగా హామీ ఇస్తున్నాను. శంకరయ్యగారు అనేక మారులు చెప్పడం, నేను జవాబు ఇవ్వడం జరుగుతూనే ఉంది. మరొక మారు దానినే పునశ్చరణ చేయవలసిన అవసరం లేదు. బసవమానయ్యగారు తెలంగాణాకు సంబంధించి చట్టాల integration గురించి చెప్పారు, వారుచెప్పకుండానే. నేను మనవిచేశాను. ఇచ్చట బిల్లు పెట్టడమైనది; suspension చేయడం అయినది; ప్లానింగ్ కమిషన్‌వారి సలహా ననుసరించి మరల సమగ్రమైన ఇనాం రద్దు చట్టం తెలంగాణాకు సంబంధించి కూడా త్వరలో తమ ముందుకు తీసుకు రావడం జరుగుతుంది. అయ్యాపు రెడ్డిగారు చెప్పిన దానికి ఇప్పుడే సమాధానం చెప్పాను. మంచెలకాని కరిపెవకాని ఈ నిర్వచనం క్రిందకు వచ్చి అప్పీలు చేయవలసిన అవసరం ఉంటే ఆ విషయం ఆలోచించబడుతుంది, రామకృష్ణరాజుగారు included, excluded inams గురించి ఒకటి point out చేశారు.

"The under-tenure estates whether pre-settlement or post-settlement, fall under Section 3 (2) (*e*) of the Estates Land Act and were attached to the parent Zamindari Estates. These grants were never made, confirmed or recognised by the Government and as such they are not inams and therefore they do not fall under Section 3 (2) (*d*) of the Estates Land Act.

The recent amendments (are) concerned only with Section 3 (2) (*d*) and do not affect the under-tenures."

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : నా పాయింటు అదికాదు. ఈ ఇనాం ఎస్టేట్లలో Pre-Settlement వి ఉన్నాయి; Post-Settlement వి ఉన్నాయి. అయితే ప్రభుత్వం ఇచ్చే నష్టపరిహారం రెండింటికి అన్వయిస్తుందా? ఏ కారణాలవల్ల?

శ్రీ కె. వెంకటరావు : 3 (2) (*d*) క్రింద వచ్చే వాటికి అన్వయిస్తుంది. 3 (2) (*e*) క్రింద వచ్చే వాటికి అన్వయించదు. 3 (2) (*d*) క్రింద వచ్చే వాటికి ఏదైనా అన్వయిస్తుంది. 3 (2) (*d*) క్రింద ఇనాం ఎస్టేటు ఉన్నదానికి compensation uniform scale క్రింద వస్తుంది.

***Sri R. B. Ramakrishna Raju*** : I request the hon. Minister to make this clear. 3 (2) (*d*) క్రింద వచ్చేవి Pre-Settlement వానా? Post-Settlement ఇనాములా?

శ్రీ కె. వెంకటరావు : Both. వారు అడగడానికి ఒక కారణం ఉన్నది. దరిమిలా ఇనాములకు same compensation రాదు. వావిలాల గోపాల కృష్ణయ్యగారు మాట్లాడుతూ 1947 వ సంవత్సరంలో ప్రైకమాండు వారు ఏదో pull చేశారని చెప్పారు. అప్పుడు వారు శాసన సభ్యులు కారు. ఈ వార్త వారికి ఎలా చేరిందో నాకు తెలియదు. అప్పుడు ఒక formula క్రింద నష్టపరిహారాన్ని లెక్క వేస్తే, ఒక కోటి 68 లక్షల ఎకరాలున్న జమీందారులన్నింటికి కలిపి $12\frac{1}{2}$ కోట్లు, 36 లక్షల ఎకరాలున్న ఇనాం విస్తీర్ణానికి 41 కోట్ల రూపాయలు నష్టపరిహారం లెక్క తేలినది. ఆ విషయం ఆలోచించి అంత డబ్బు ఇనాముల నష్టపరిహారానికి ఇవ్వడానికి వీలు లేదని మానివేశాము. ఇది కారణం కాని ప్రైకమాండు ఎవరినీ pull చేయలేదు; ఎవరూ pull చేయించుకోలేదు.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య : ఆ రోజు వెంకటరావుగారికి జ్ఞాపకం ఉండి ఉంటుంది, ఒక పెద్ద సమావేశం జరపడం, దానిలో వారు పాల్గొనడం—

మిస్టర్ స్పీకర్ : అది irrelevant; personal explanation అనవసరం.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య : నేను చెప్పిన దానిని explain చేయవలసి యున్నదికదా. చట్టం తీసుకువస్తామని చెప్పిన తరువాత పైనుంచి ఒత్తిడివావడం మాను కోవడం ప్రజలకందరికి తెలుసు.

మిస్టర్ స్పీకర్ : ఎట్లా తెలుసు ?

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య : మొత్తం మీద మానుకున్నారని తెలుసును.

మిస్టర్ స్పీకర్ : అంతవరకే తెలుసును కాని కారణం ఏమో తెలియదు, నిజమో, అబద్ధమో!

శ్రీ కె. వెంకటరావు : నేను సమావేశానికి వెళ్ళిన మాటనిజం. వల్లభనేని సీతా మహాలక్ష్మమ్మగారు preside చేసినమాట నిజం. వారింటివే commentators నవ్వు కమ్యూనిస్టులలో చేర్చినమాట నిజం, సమావేశం సంగతి వదలి పెట్టండి. అధ్యక్షులవారు విశద పరచారు. Notification is not a legal document. మనకు న్యాయం ఎస్టేటు అని తెలుసును. కోర్టులు కాదు అంటాయి. అప్పుడు contest చేయడానికి వాక్కు సంపాదించుకున్నాము, దానికి తగిన పరిహారంఇవ్వటం జరుగుతుంది. లచ్చన్నగారి నిర్వచనాన్ని నేను అంగీకరిస్తున్నాను. జమీందారీలలో ఉండేటటువంటి భూమి, పట్టాలకు ఇవ్వడంవల్లనో మరొక కారణంచేతనో ఎస్టేటు కాదనే నిర్ణయం జరుగదనే విషయంమీద stress ఇచ్చారు. దానితో నేను మొదటినుంచి ఏకీభవిస్తున్నాను. మిగిలిన విషయాలు పోగా కోటిరెడ్డిగారి వాదన ఏమిటే అంటే—ఇనాం రద్దు అయిపోతుంది; ఆ గ్రామంలో ఇదివరకు ఎప్పుడూ రైతు స్వాధీనంలో లేని private land నిర్వచనం క్రింద ఇనాందారుకు చెందిన భూమి ఉంటుంది; ఆ భూమిని ఇనాందారులకు ఎందుకు వదలకూడదు; వారు ఏమి పాపం చేశారని. నిన్న శంకరయ్యగారికి మనవి చేశాను. ఆ భూమి గవర్నమెంటుది అవునా, కాదా తేలాలి. తరువాత పంచిపెట్టడం విషయమై ప్రతిపక్ష సభ్యులు, మా పక్ష సభ్యులు ఇదివరకే చెబుతున్నారు. ఇనాం దారులు ఎవరైనా చట్టం క్రింద oust అయితే ఆ గ్రామంలో ఏమైనా భూమి దొరికితే

అందరితో పాటు వారికి పంచవచ్చును అని అందరూ చెబుతున్నారు. Uncultivated అనాధీనం భూములు దొరికినట్లయితే—ఇక ముందు సీలింగు మొదలైనవన్నీ వస్తాయి కాబట్టి భూములు కోల్పోయిన ఇనాందారులకు అందులోనుండి పంచే విషయం తప్పకుండా ఆలోచించడం జరుగుతుందని ప్రభుత్వం తరఫున మనవి చేస్తున్నాను.

శ్రీ బి. శ్రీరామమూర్తిగారు ఏదో వూరు చెప్పారు. ఇక్కడ అది చర్చించే సమస్యకాదు. ఆ విషయానికి నేను సమాధానం చెప్పాను. శ్రీరామమూర్తిగారు యువకులు. అసమర్థత అయోగ్యత అసాధారణము అలా "అ" లతో ప్రారంభమయ్యే పదాలు వాడి ప్రసంగించడం, వారికి అలవాటు. అందుకే పందు దొరికిందికదాఅని నాలుగైదు పదాలు విసిరారు. ఆలస్యం అవటానికి మా అసమర్థత కారణం కాదు. మేమంతా సమర్థులమని చెప్పకోవటం కాదు కాని అది మా అసమర్థత మాత్రం కారణం కాదని మనవి చేస్తున్నాను. పార్టీ నాయకులైన పెద్ద లే ఈ యాక్టు క్రింద వచ్చిన భూములు తమవని కోర్టులో దావాలు వేసి, అడ్డురావటం వల్ల ఈ ఆలస్యం జరుగుతోంది. దానికి పరిష్కార మార్గం శ్రీరామమూర్తిగారే ఆలోచించాలి గాని నేను ఆలోచించే విషయం కాదని సవినయంగా మనవి చేస్తున్నాను.

నాగినేని వెంకయ్యగారు యింకా ఏవో చేరలేదనే బాధ మనసులో వుంచుకొని మాట్లాడారు. ఈ విషయాలు చెప్పటానికి ఛాన్సు వచ్చిందని, ఏవో మనసులో పెట్టుకొని ఇక్కడ అవన్నీ చెప్పారు. వారు మా పార్టీ సభ్యులు, రైతు సంఘంలో బాగా పని చేస్తున్నవారు. వారు మాకు ఏమైనా చెప్పవలసి వుంటే ఆఫీసులోగాని పార్టీ సమావేశంలో కాని, ఇంటివద్ద కాని చెప్పవచ్చు. ఫలానా విషయంలో ఫలానాది తప్పు దిద్దుకోవయ్యా అంటే దిద్దుకోటానికి మాకు ఏమీ అభ్యంతరం లేదు. అంతేకాని ఇలాంటిచోట వారు చర్చలోకిదిగటం న్యాయమైనవిషయంకాదు.

రాజాగోపాలనాయుడుగారు షెడ్యూల్ ఒకటి ప్రచురించవలసినదిగా కోరారు. షెడ్యూల్ ప్రచురించే అధికారం గవర్నమెంటుకు లేదు. మనం షెడ్యూల్‌లో వేసినంత మాత్రాన Notification షెడ్యూల్ 'అథారటి' క్రింద జరగవు. ఒకడి ప్రాపర్టీ ఒకడిది అయి పోదు. అది ఎస్టాబ్లిష్డ్ రైట్ క్రింద రావలసి వుంటుంది కనుక దీనివల్ల లాభం ఏమీ వుండదు. అయినా ఎక్కడైనా escape అయితే చూస్తామని వారికి మనవి చేస్తున్నాను.

నేను శంకరయ్యగారిని ఏదో ఆపేస్తున్నానని, యువకుడు కనుక ఏదో ఉపన్యాసం విసురు దామని ఎల్లమందారెడ్డిగారు చూశారు. ఆయన ఈ కోర్టులు ఏమిటని అడిగారు. ప్రపంచంలో కోర్టులు లేని దేశము ఏదీ లేదు. అధమపక్షం పీపుల్స్ కోర్టులు అయినా వున్నాయి. చెట్టుకు కట్టి ఉరి తీసే అధికారం మనకు లేదు కనుక కోర్టులద్వారానైనా పూర్తి చేద్దామని అను కొంటున్నాము. అక్కడ న్యాయం జరుగుతుందనే నా నమ్మకం.

శ్రీ టి. ఎల్లమందారెడ్డి : మన ఉద్దేశ్యాలకు మనం చేసే శాసనాలకు వ్యతిరేకమైన interpretation చేసే అధికారం కోర్టులకు వుండకూడదనే నా ఉద్దేశ్యం. వారి కి... చెప్తున్నారు గనుక నేను చెప్పాను.

శ్రీ కె. వెంకటరావు: కోర్టులు అలా చేస్తున్నప్పటికి మనం దిద్దుకొంటున్నాము. అందుకే ఇన్ని amendments వస్తున్నాయి. "అది మనం అనుకొన్న దానికి వ్యతిరేకంగా చేసింది, అది న్యాయానికి విరుద్ధం, పునాది న్యాయాన్ని నిర్ణయించే శక్తి Legislature కు వుంది" అనే నమ్మకం మనకు వుండటంవల్లనే 1908 లో, 1934 లో, దానికి 1936 లో ఇలా 1945 లో, 1956 లో ఇప్పుడు యింకొకటి యిలా amendments తెస్తున్నాము ఇందులో కూడా లోపం వుంటే యింకో amendment తీసుకురావాలి కాని కోర్టులను తోసేసి వేయటం కష్టమవుతుందని మనవి చేస్తున్నాను.

Evictions గురించి కొందరు సభ్యులు మాట్లాడారు. Estates Land Act క్రింద హక్కు వున్న tenant ను తొలగించే హక్కు లేదు. అందుచేత question of evicetion does not arise. ఎవరైనా evict చేశారంటే అది చట్టవిరుద్ధంగా చేసినట్లవుతుంది. Estates Land Act క్రింద లోబడి చేయటానికి ఆస్కారం లేదు. అది ఎస్టేటు కాకపోతే మాత్రం నేను చెప్పలేను.

రైతువారీ విషయం గురించి ముగ్గురు, నలుగురు సభ్యులు మాట్లాడారు. "ఆంధ్ర టెనెంట్స్ యాక్టు" క్రింద ఒక రైతు సాగు చేసుకొంటూ వుంటే మూడు సంవత్సరాల పాటు అతనే వుంటాడు. మళ్ళీ తీసికొంటే వరుసగా ఆరు సంవత్సరాలు వుంటాడు. అందుచేత automatic protection రెండు చోట్లా వుంది. వాటికి abuses ఏమైనా వుంటే, వాటిని సర్దుకోవాలి. Statutory గా దీనికి రక్షణ వుందని మనవి చేస్తున్నాను.

మొత్తం మీద, ఈ ఇనాములను రద్దు చేయకుండా అలాగే వుంచాలని ఎవరూ కోరటం లేదు. అందుచేత నేను చెప్పిన అన్ని విషయాలను మనస్సులో వుంచుకొని ఈ శాసనాన్ని త్వరలో pass చేయవలసిందిగా మిమ్ములను నేను కోరుతున్నాను.

*Mr. Speaker:* The hon. Member Sri B. Sankaraiah has given a list of villages and wants that they should form part of the proceedings. I have no objection and the list will be added to his speech in the proceedings.

The question is:

"That the Madras Estates (Abolition and Conversion into Ryotwari) (Andhra Pradesh Amendment) Bill, 1957, as reported by the Select Committee be taken into consideration at once."

**The motion was adopted.**

*Mr. Speaker*: The House will now adjourn and meet again at 8-30 a.m. tomorrow.

*The House then adjourned till Half Past Eight of the Clock on Tuesday, the 29th October 1957.*